దినం తదాంతరభాగకలాభిః కిమతోఽంతర భాగానాం కలార్థం సర్వత్ర షష్టిగుణః స్వకేంద్రగతిర్హారః తత్రాచార్యేణ లాఘవార్థం స్వల్పాంతరత్వాత్ - శీఘ్రకేంద్రగతయో మధ్యమా ఏవగృహీతాః - తత్ర భౌమస్య శీఘ్రకేంద్రగతిః ౨౭-౪౨ అత్రగుణహారౌ హారేణాపవర్త్య జాతో గుణః ౨ బుధశీఘ్రకేంద్రగతిః ౧౮౬-౨౪ గుణహారౌ గుణే నాపవర్త్య జాతో హారః 3 గురోః ౫౪ గుణహారౌ షడ్భిః అపవర్తితౌ గుణః ౧౦ హారః ౯ యోరాశిర్దశభిర్గుణ్యతే నవభిర్భజ్యతే సస్వనవమాంశాధిక ఏవ భవతి - ఏవం శుక్రస్య శీఘ్రకేంద్రగతిః ౩౭ అత్ర గుణహారౌ షడ్భిరపవర్త్యగుణః ౧౦ హారః ౬ అతో దశహతాంగహృతాః - ఏవం శనేః శీఘ్రకేంద్రగతిః ౫౭-౮- గుణహారయోః సామ్యాత్ పృథక్త్వ ఇతిలబ్ధైర్దినై ర్వక్రాద్యం గతైష్యం స్యాదిత్యుపపన్నమ్॥ 18.

తా॥ వక్రవక్రత్యాగోదయాస్తమయములు గ్రహములయొక్క ద్వితీయశీఘ్రకేంద్రభాగలనుబట్టి చెప్పఁబడియున్నందున ఆ ధ్రువకములకంటె కేంద్రభాగ లెక్కువగా నుండునపుడు ధ్రువకమును తీసి శేషమును గతముగాను - తక్కువగానుండునపుడు ధ్రువకములోనుండి తీసి ఏష్యముగాను జేయవలెను. ఎట్లనఁగా శేషభాగాదిని కుజునకు ౨ చే గుణింపవలెను. బుధునకు 3 చే భాగించవలెను - గురునకు ౯ వ భాగము గలుపవలెను, శుక్రునకు ౧౦ చేఁ బెంచి ౬ చే విభజింపవలెను. శనికి ౧చే భాగింపవలెను. ఇందువలనవక్రము మొదలగు వాని ప్రవేశముయొక్క దినము గడియలు, విగడియలు వచ్చును. గతైష్యముల నెఱిఁగి పర్వస్ఫుటవారములో ఋణధనములు చేయవలెను. 18.

ఉదాహరణము॥ బుధవక్రత్యాగమునకు, ధ్రువకము భాగాది ౨౧౫ - ౦ - ౦ - శీఘ్రకేంద్రభాగలు ౨౦౮ - ౪౬ - ౩౨=౬ - ౧౩ - ౨౮ ÷ ౨ - ౪ - ౨౯ దినాది పూర్ణిమ మంగళవారము పర్వము గలుప - వారాది 3 - ౦ - ౦=౫- ౪- ౨౯ అయిదవవారము గురువారము ఆశ్వయుజ బ ౨ గురువారముగాన అదినమున గడి ౪ విగ ౨౯ కి బుధవక్రత్యాగము - ఇది ఏష్యప్రవేశము - శుక్రకేంద్ర భాగాది ౧౯౩-౨౬-౧౪— వక్రత్యాగ ధ్రువకము ౧౯౩ - ౦ - ౦ శేషము ౦- ౨౬- ౧౪×౧౦÷౬౦-౪౩-౪౩ తతప్రవేశము గాన పూర్ణిమామంగళవారము 3-౦-౦



లోనుండి తీసివేఁగా వారాది ౨ - ౧౬ - ౧౭ రెండవది సోమవారము గాన పూర్ణిమకు లోగడ శుక్ల ౧౪ సోమవారము గడి ౧౬ విగ ౧౭ కి శుక్రవక్రత్యాగము. బుధోదయమునకు - పూర్వోదయభాగలు ౨౦౫ కంటే శీఘ్రకేంద్రభాగలధికముగాన గతముగాఁ జేయవలెను. కేంద్రభాగాది ౨౦౮-౪౬-౩౨—ధ్రువక భాగాది ౨౦౫ ౦ - ౦ శేషము 3 - ౪౬ - ౩౨ ÷ 3 = ౧ - ౧౫ - ౩౦ మంగళవారములో తీసివేఁగా ౧ - ౪౪ - ౩౦ ఆశ్వయుజ శుక్ల ౧౩ ఆదివారము ప్రాగుదయంబుధః గడి ౪౪-౩౦- శని శీఘ్రకేంద్రము ౨౪౭ - ౨౫ - ౫౩—వక్రత్యాగ ధ్రువకము ౨౪౭- ౦ - ౦ తీసివేఁగా ౦ - ౨౫ - ౫౩ ÷ ౧=౦ - ౨౫ - ౫౩ గతముగాన మంగళవారములో తీసివేఁగా ౨ - ౩౪ - ౭ కి శుక్ల ౧౪ సోమవారము ౩౪ - ౭ కి శనివక్రత్యాగము వక్రాస్తమయములకు నిట్లే యూహింపవలెను॥ 18.

అథ భౌమగురు శనీనాం పశ్చాదస్తాది దినప్రమాణానాహ.

శ్లో॥ భౌమస్యాస్తాదుదయకుటిలర్జుత్వమాద్యం క్రమాత్స్యన్మాసై ర్వేదై రథదశమితై ర్లోచనాభ్యాంచ దిగ్భిః। జీవస్యోర్వ్యాస్సచరణయుగైః సాగరై స్సాంఘ్రివేదైః సాంఘ్రైర్మాసైకేన త్రియుగదహనై రర్ధయుక్తైస్తథార్కైః॥ 19.

టీ॥ భౌమస్య = అంగారకునికి - అస్తాత్ = అస్తమయము మొదలుకొని, వేదైః = ౪ అయినట్టువంటియు - అథ = పిమ్మట - దశమితైః = ౧౦ అయినట్టువంటియు - లోచనాభ్యాం = ౨ అయినట్టువంటియు - దిగ్భిశ్చ = ౧౦ అయినట్టువంటియు - మాసైః = మాసములచేత - క్రమాత్ = వరుసగా - ఉదయకుటిలర్జుత్వమాద్యం - ఉదయము - వక్రము - ఋజుత్వము - అస్తమయమును - స్యాత్ =అగును- జీవస్య = బృహస్పతికి - ఉర్వ్యా = ౧ అయినట్టువంటియు, సచరణయుగైః = ౪ - ౧/౪ (౪।) అయినట్టువంటియు - సాగరైః = ౪ అయినట్టువంటియు - సాంఘ్రివేదైః ౪ - ౧/౪ (౪।) అయినట్టువంటియు - మాసైః = మాసములచేత - క్రమాత్ = వరుసగా - ఉదయకుటిలర్జుత్వమాద్యం = ఉదయము - వక్రము - ఋజుత్వము - అస్తమయము - స్యాత్ =అగును - తథా = అప్రకారమే - అర్కైః-

శనికి - అస్తాత్ = అస్తమయము మొదలుకొని - సాంఘ్రిశ్రియేకేన = ౧ - $\frac{౧}{౪}$ అయినట్టువంటియు, అర్ధయుక్తైః = సగముతోఁగూడిన - త్రియుగదహనైః = ౩-౪-౩ అయినట్టువంటివియు - మాసైః = మాసములచేత - క్రమాత్ = వరుసగా - ఉదయకుటిలర్జుత్వపశ్చాద్యం = ఉదయము - వక్రము - ఋజుత్వము - అస్తమయమును - స్యాత్ = అగును. 19.

ఉపపత్తి ముందుశ్లోకములో వ్రాయబడును.

తా॥ శుక్రునకు పశ్చాదస్తమయము మొదలు ౪ మాసములకు ఉదయమును-ఉదయము మొదలు ౧౦ మాసములకు వక్రమును -వక్రము మొదలు ౨మాసములకు ఋజుత్వమును - ఋజుత్వము మొదలు ౧౦ మాసములకు పశ్చాదస్తమయమును గలుగును- గురునకు ౧ - ౪ - $\frac{౧}{౪}$ ॥ ౪-౪- $\frac{౧}{౪}$ మాసములును- శనికి ౧ - $\frac{౧}{౪}$ ॥ ౩ - $\frac{౧}{౨}$ ౪ - $\frac{౧}{౨}$ ॥ ౩ - $\frac{౧}{౨}$ మాసములునును శుక్రునివలెనే ఉదయాదులకు వరుసగా ప్రమాణములగును॥ 19.

## అథబుధశుక్రయోః పూర్వాస్తాది దినప్రమాణా న్యాహ.

శ్లో॥ పూర్వాస్తాదుదయః పరేఽనృజుగతి స్తోయాస్తమైంద్ర్యుద్గ
మో । మార్గాస్తోఽత్రిచ। దంతదంతదహనా ష్ట్యాజ్యాశదంతైర్దినైః।
చాంద్రేస్త్వపరతత్పరం త్వథభృగో స్తద్వద్ద్విమాస్యాతతోఽ। ష్టాభి
ర్వ్యంఘ్రిభువాంఘ్రిణా విచరణైకే నాష్టమాసైః క్రమాత్॥ 20.

టీ॥ దంతదంతదహనా ష్ట్యాజ్యాశదంతైః - దంత=౩౨, దంత ౩౨= దహన, ౩- అష్టి ౧౬ అజ్యాశ=౩-దంతైః=౩౨- అయినట్టువంటి - దినైః = దినములచేత- చాంద్రేః=బుధునకు, క్రమాత్=వరుసగా, పూర్వాస్తాత్=తూర్పున అస్తమయము మొదలుకొని, పరే=పశ్చిమదిశను, ఉదయః=ఉదయము, అనృజుగతిః=వక్రత్వము- తోయాస్తం=పశ్చిమాస్తమయము, ఐంద్ర్యుద్గమః = పూర్వోదయము, మార్గః= ఋజుత్వము, అస్తః=పూర్వాస్తమయము, తత్పరతత్పరం=ఒకదానివిమ్మట నొకటి



వరుసగా, స్యాత్ = అగును, భృగోః = శుక్రునకు, క్రమాత్ = వరుసగా, ద్విమాస్యా = ౨ మాసములచేతను, తతః = పిమ్మట, అష్టాభిః = ౮ మాసములచేతను, వ్యంఘ్రిభువా=పాదరహితమైన=౧ మాసము (౨౨½ దినములు) చేతను, అంఘ్రిణా=మాసములోని=౧-పాదము (౭½ దినములు) చేతను, విచరణైకేనచ = పాదోనమాసము (౨౨½ దినములు) చేతను, అష్టమాసైః= ౮మాసములచేతను, తద్వత్ = బుధునకువలెనే పూర్వాస్తాది దినప్రమాణములు, స్యాత్ = అగును॥ 20

ఉపపత్తిః॥ పూర్వాస్తశీఘ్రకేంద్రాంశాః పశ్చిమోదయశీఘ్రకేంద్రాంశకేభ్యో యావదంతరితా స్తావదంశానాం కలాః కేంద్రగతిభక్తాః దినాని స్యుః- ఏవం వక్రమార్గాదీనా మపి తత్తత్కేంద్రాంశరాద్దినానిస్యు రిత్యుపపన్నమ్॥ 20.

తా॥ బుధశుక్రులకు వరుసగా పూర్వాస్తమయము మొదలుకొని -౩౨-౬౦ దినములకు పశ్చాదుదయమును, పశ్చాదుదయము మొదలుకొని, ౩౨-౨౪౦ - దినములకు వక్రత్వమును, వక్రత్వమును మొదలుకొని- ౩ - ౨౨½ దినములకు పశ్చాదస్తమయమును, పశ్చాదస్తమయము మొదలుకొని- ౧౬ - ౭½ దినములకు ప్రాగుదయమును, ప్రాగుదయము మొదలుకొని - ౩ - ౨౨½ దినములకు ఋజుత్వమును, ఋజుత్వము మొదలుకొని - ౩౨ - ౨౪౦ దినములకు ప్రాగస్తమయమును గలుగును॥ 20

ఇతి గణేశదైవజ్ఞ విరచిత గ్రహలాఘవే శుక్రాదిపంచగ్రహ
స్ఫుటాధికార స్తృతీయః



పశ్చాదస్తాదిపూర్వాస్తమయపర్యంతం దినప్రమాణచక్రము.

| గ్రహములు. | పశ్చాదస్తాత్ప్రాగుదయం. | ప్రాగుదయాత్ వక్రత్వం. | వక్రాత్ ఋజుత్వం. | ఋజుత్వాత్ పశ్చాదస్తం. | పూర్వాస్తాత్ పశ్చాదుదయం. | పశ్చాదుదయాత్ వక్రత్వం. | వక్రాత్ పశ్చాదస్తం. | పశ్చాదస్తాత్ పూర్వోదయం. | పూర్వోదయాత్ ఋజుత్వం. | ఋజుత్వాత్ ప్రాగస్తమయం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కు | మా ౪ | మా ౧౦ | మా ౨ | మా ౧౦ | ... | ... | ... | | ... | ... |
| బు | ది ౧౬ | ... | ... | ... | ది ౩౨ | ది ౩౨ | ది ౩ | | ది ౩ | ది ౩౨ |
| గు | మా ౧ | మా ౪౧ | మా ౪ | మా ౪౧ | ... | ... | ... | | ... | ... |
| శు | ది ౭౫ | ... | ... | ... | మా ౨ | మా ౮ | ది ౨౨౫ | | ది ౨౨౫ | మా ౮ |
| శ | మా ౧౧ | మా ౩౫ | మా ౪౫ | మా ౩౫ | ... | ... | ... | | ... | ... |

వక్రాదిదిన ప్రమాణచక్రము.

| గ్రహములు | వక్రప్రమాణదినాని. | ప్రాగుదయాత్ పశ్చాదస్తదినాని | పశ్చాదుదయాత్పశ్చాదస్తదినాని | పశ్చాదస్తాత్ మాధ్యదినాని. | ప్రాగస్తమయాత్ మాధ్యదినాని |
|---|---|---|---|---|---|
| | దినాః | దినాః | దినాః | దినాః | దినాః |
| కు | ౬౬ | ౬౬౦ | ... | ౧౨౦ | ... |
| బు | ౨౧ | ౩౭ | ౩౯ | ౧౬ | ౩౨ |
| గు | ౧౨౦ | ౩౭౨ | ... | ౩౦ | ... |
| శు | ౯౨ | ౨౯౧ | ౨౬౨ | ౧౦ | ౬౦ |
| శ | ౧౩౯ | ౩౪౨ | ... | ౩౬ | ... |

## శ్రీ రస్తు.

## త్రిప్రశ్నాధికారః.

### అథ మేషాదీనాం స్వోదయానాహ.

శ్లో॥ లంకోదయా విఘటికా గజభాని గోంకదస్రా స్త్రిపక్షదహనాః క్రమ గోత్క్రమస్థాః। హీనాన్వితా శ్చరదలైః క్రమగోత్క్రమస్థై ర్మేషాదితో ధటత ఉత్క్రమత స్త్విమేస్యుః॥ 1.

టీ॥ గజభాని=౨౭౮ - గోంకదస్రాః=౨౯౯ - త్రిపక్షదహనాః = 3౨3- ఏతే = ఇవి, క్రమస్థాః=వరుసగానుంచబడినవై (మేషాదిత్రియాణాం=మేషవృషభ మిథునములకు) లంకోదయాః = లంకాలగ్నప్రమాణములగు, విఘటికాః = విగడియ లు, స్యుః = అగును, ఏతే = ఇవి, ఉత్క్రమస్థాః = తుదనుండి మొదటికి నుంచ బడినవై (కర్కాదిత్రియాణాం = కర్కాటకము మొదలు 3 రాసులకు, లంకో దయాః = లంకాలగ్నప్రమాణములు - స్యుః = అగును) ఇమే = ఇవి-క్రమగోత్క్ర మస్థాః క్రమగః=ఈ యారురాసుల ప్రితులుపైని వరుసప్రకారముగాను, ఉత్క్ర మస్థాః=చివరనుండి మొదటికి నుంచబడినవై లంకాలగ్నప్రమాణము లగును - క్రమ గోత్క్రమస్థైః=క్రమముగాను, ఉత్క్రమముగా నుంచబడిన, చరదలైః=చరఖం డములచేత, హీనాన్వితాః - హీన=తివచంబడి, అన్వితాః - కలుపబడినవియయి (క్రమతః = వరుసగా నుంచబడినవి) మేషాదితః = మేషము మొదలుకొనియు, ధటతః = తుల మొదలుకొనియు, ఉత్క్రమతః = చివరనుండి మొదటి నుంచబడి నవి, స్యుః = అగును. 1.

ఉపపత్తిః॥ క్రాంతివృత్తే క్షేత్రవిభాగేన ద్వాదశరాశయ స్తుల్యప్రమాణా ఏవ భవంతి - నాడీవృత్తే కాలాంశవిభాగేన సర్వేరాశయః ఉదయంతి - నిరక్షే తస్మా డ్వృత్తం సమం పూర్వాపరం సమమండలవద్భ్రమతి - క్రాంతిమండలంచ దక్షిణో త్తరత స్తిరశ్చీన ముదేతి - క్రాంతివృత్తస్థో మేషో యావత్తిరశ్చీన ఉదేతి - తావ ద్విషువద్వృత్తేఽష్టావింశతిభాగాః కించిన్న్యూనాః - ఏవం - సర్వేఽపి సాధనోపా యా యథాసిద్ధాంతోక్త బృహజ్జ్యయైవ మేషాదీనాం త్రియాణాం స్వక్రాంత్య

గ్రేషు త్రీణి స్వాహోరాత్రవృత్తాని విషువత్ ఉత్తరతో బధ్నీయాత్ తథా తులాదికానాం విషువద్వృత్తతో దక్షిణత స్త్రీణి స్వాహోరాత్రవృత్తాని స్వక్రాంత్యగ్రేషు బధ్నీయాత్ - తత్క్రాంతిమండలే మేషాంతే సూత్ర మైకం అగ్రం బధ్వా ద్వితీయ మగ్రం మీనాదౌ బధ్నీయాత్ - ఏవం వృషమిథునాంతయోః సూత్రాగ్రే బధ్వా - తయోర్ద్వితీయాగ్రకే కుంభమకరాదౌ బధ్నీయాత్ - తేషాం సూత్రాణాం యా న్యర్ధాని తాని క్రమేణ మేషవృషమిథునాంతానాం జీవా స్త ఏవ మీనకుంభమకరాణాం తత స్తాభిః కర్కటసూత్రా ద్విషువత్కల్పనం మధ్య త్రీణివృత్తాని కృత్వా నిష్పాదయేత్ - తత్ర స్వజీవాకర్ణః స్వక్రాంతిజ్యా యామ్యోత్తరా భుజః - కోటి రూర్ధ్వాధరా సజ్ఞాయతే - మేషవృషయోః మిథునజ్యయా యద్వృత్తముత్పద్యతే - త ద్యామ్యోత్తరవృత్త మేవ భవతి—త త్రైవోర్ధ్వాధరా కోటిః స్వాహోరాత్రవ్యాసార్ధతుల్యా భవతి - మేషవృషయో రూర్ధ్వా కోటిః స్వాహోరాత్రేన జ్ఞాయతే - తత్పరిజ్ఞానా యాఽనుపాతద్వయం - త ద్యథా - యది మిథునజ్యాత్రిజ్యా కర్ణస్య మిథునస్వాహోరాత్రవృత్త వ్యాసార్ధతుల్యోర్ధ్వాధరకోటి స్తదా మేషజ్యాకర్ణేన కేతి - తతో వ్యాసార్ధవృత్తపరిణామాయ ద్వితీయం త్రైరాశికం-యది మేషస్య స్వాహోరాత్రవృత్తే ఏతావతీ కోటి స్తదా త్రిజ్యావృత్తే కిమితి - ఏవం ప్రథమం త్రిజ్యాగుణోఽనంతరం హరస్తుల్యత్వాత్తయో ర్నాశే కృతే మిథునస్వాహోరాత్రవ్యాసార్ధస్య మేషజ్యాగుణః - మేషః స్వాహోరాత్రవృత్తవ్యాసార్ధం హరః ఫలం మేషస్య వృత్తే వ్యాసార్ధే ఊర్ధ్వా కోటిః - ఏవం వృషమిథునయోః కోటి సాధ్యే - కోటిఫలానాం జ్యారూపాణాం ధనూంషి కర్తవ్యాని - యతో వృత్తగత్యా క్రాంతిమండల ముదేతి - అతో ధనుఃకరణం మిథునకోట్యా ఉదయంత్యా మేషవృషా వప్యుదయతః - అతో వృషచాపం మిథునచాపా ద్విశోధ్యతే - మిథునోదయప్రాణాః స్యుః - మేషోదయప్రాణా యథా గతా ఏవ తే చైతే మేషే- ౧౬౭౦ - వృషే - ౧౭౯౫-మిథునే - ౧౯౩౫ - ఏతే షడ్భక్తాః ఫలాని స్యుః - యతః షడ్భి రసుభి రేకం ఫలం - ఏవం జాతా గజభా నీత్యాదయః - మేషజ్యాకర్ణః సన్నిహితత్వా న్మేషకోట్యా ఉదేతి - వృషజ్యాకర్ణః కించి ద్విప్రకృష్టత్వాత్ మహత్యా వృషకోట్యా ఉదేతి - మిథునజ్యాకర్ణః విషువన్మండలా దతిదూరే స్థితత్వాత్ తిర్యక్త్వ గతిమహత్యా మిథునకోట్యా ఉదేతి - తతో మిథునాంతాదిభ్యాం కర్కటా



ద్యంతౌ సమావతో మిథు నోదయప్రాణాః కర్కోదయః స్యాత్ - ఏవం వృషమేషాంతాదిభ్యాం సింహకన్యాద్యంతౌ సమౌ అతో వృషమేషసమౌ సింహకన్యా ద్వితీయమండలార్ధస్య విషువతో దక్షిణేన స్థితత్వాత్ - మేషాద్యుదయాన ముత్క్రమేణోదయప్రాణా స్తులాదిషు భవంతి - ఏవం నిరక్షదేశే - అన్యథా యది విషువద్వృత్తే రాశయః స్యుస్తదా పంచఘటికా రాశ్యుదయాః స్యుః - రాశయశ్చాపమండలే తస్మా ద్భిన్నప్రాణా రాశ్యుదయా నిరక్షే స్యుః-ఏతత్సర్వం యథాస్థితే నిరక్షగోళే దర్శయేత్ - అథ స్వదేశోదయోపపత్తిః - అక్షవశా ద్విషువద్వృత్తమపి తిర్యగ్భవతి - తద్వశా న్మేషాదీనాం స్వాహోరాత్రాణ్యపి తిర్యగ్భవంతి - అతో మేషాదయః స్వచరార్ధై ర్వియుజ్యంతే - మేషాదయస్తిర్యక్కర్ణరూపాః కర్ణాచ్చకోటిరల్పా స్యాత్ - క్రమా చ్చరదళహీనాః స్వదేశోదయః స్యుః-అతో విషువన్మండలపాదేన చరదళహీనే నాయ మపవృత్తపాదః ప్రథమం ఉదేతి కర్కాదయః వ్యస్తైః చరదళై ర్యుక్తాః క్రియతే యత స్తేషాం విపరీతం తిర్యక్త్వం తే ఉత్క్రమచరఖండయుక్తాః - కర్కాదీనాం త్రయాణా ముదయాః స్యురితి-అతః క్రాంతివృత్తపాదో ద్వితీయ శ్చరదళీయుక్తేన విషువద్వృత్తపాదే నోదేతీత్యుపపన్నం - ద్వితీయపాదవ త్తృతీయః - ప్రథమవత్ చతుర్థోపి - వృత్తపాద ఉదేతి- ఉక్తంచ భాస్కరీయే సిద్ధాంతే॥ శ్లో॥ మేషాదే ర్మిథునాంతా న్నాడీభి స్తిథమితాభి రుద్వలయే - లగతిభుజే త దథః స్థే ప్రథమం తాభి శ్చరో నాభిః॥ 1 "కన్యాంతా ద్ధనుషేంత స్తిథమితనాడేభి రుద్వృత్తే లగతి భుజే చోర్ధ్వస్థే పశ్చాత్తాభి శ్చరాధ్యాభిః॥" 2 ఏవ మత్రసంక్షిప్తోదయోపపత్తి ర్విస్తరభయా దుక్తా॥ 1

తా॥ లంకాలగ్నప్రమాణము లగు ౨౭౮-౨౯౯-౩౨౩-౩౨౩-౨౯౯-౨౭౮-౨౭౮-౨౯౯-౩౨౩-౩౨౩-౨౯౯-౨౭౮ - విఘటికాప్రమాణములలో రవిచంద్రస్ఫుటాధ్యాయములోఁ జెప్పఁబడిన స్వదేశచరఖండముల మూఁడింటిని క్రమముగాను, ఉత్క్రమముగాను ఋణధనములు చేయ స్వదేశలగ్నప్రమాణము లగును॥ 1.

---

ఉదాహరణము॥ రాజమండ్రికి చరఖండములు ౩౭-౩౦-౧౨

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౨౭౮<br>౩౭ | ౨౯౯<br>౩౦ | ౩౨౩<br>౧౨ | ౩౨౩<br>౧౨ | ౨౯౯<br>౩౦ | ౨౭౮<br>౩౭ |
| ౨౪౧ | ౨౬౯ | ౩౧౧ | ౩౩౫ | ౩౨౯ | ౩౧౫ |
| ౨౭౮<br>౩౭ | ౨౯౯<br>౩౦ | ౩౨౩<br>౧౨ | ౩౨౩<br>౧౨ | ౨౯౯<br>౩౦ | ౨౭౮<br>౩౭ |
| ౩౧౫ | ౩౨౯ | ౩౩౫ | ౩౧౧ | ౨౬౯ | ౨౪౧ |

అథ లగ్నస్ఫుటసాధన మాహ.

శ్లో॥ తత్కాలార్కః సాయనః స్వోదయఘ్నా భోగ్యాంశాఃఖ త్ర్యుద్ధృతా భోగ్యకాలః। ఏవం యాతాంశైర్భవేద్యాతకాలో భోగ్యః శోధ్యోభీష్టనాడీ పలేభ్యః॥ 2.

శ్లో॥ తదను జహీహి గృహోదయాంశ్చ శేషం గగనగుణఘ్న మశుద్ధహృల్లవాద్యం। సహిత మజాదిగృహై రశుద్ధపూర్వై ర్భవతి విలగ్న మధోఽయనాంశహీనం॥ 3.

టీ॥ (యస్మిన్ కాలే లగ్నంసాధ్యతే = జననకాలమునఁగాని పర్వాంతమునఁగాని యొప్పటికి లగ్నస్ఫుటము కావలయునో ఆ కాలమునకు) తత్కాలార్కః = తాత్కాలిక స్ఫుటసూర్యుఁడు, సాయనః = అయనాంశసహితుఁడై, భోగ్యాంశాః = భోగ్యభాగలు (ఏష్యభాగలు) అనఁగా 30 భాగలలో తీవఁబడి, స్వోదయఘ్నాః = అప్పుడు రవియుండు లగ్నపరిమాణముచేఁ హెంచబడి, ఖత్ర్యుద్ధృతాః = 30 చే భాగింపఁబడఁగా, భోగ్యకాలః = ఏష్యకాలము, స్యాత్ = అగును, ఏవం = ఈ ప్రకారముగా, యాతాంశైః = గతభాగలచేత, యాతకాలః = గతకాలము, భవేత్ = అగును, భోగ్యః = భోగ్యకాలము, అభీష్టనాడీపలేభ్యః = ఇష్టఘటికలనుండి, శోధ్యః = తీవఁబడవలెను. తదను = పిమ్మట (తస్మాత్ = దానినుండి) గృహోదయాంశ్చ = సాయన రవియుండులగ్నమునకుఁ బిమ్మట లగ్నములపరిమాణము లెన్ని



పోవునో అన్నియును, జహీహి = తీవిచి, శేషం = మిగిలినదానిని, గగనగుణఘ్నం = 30 చేత గుణించి, అశుద్ధహృత్ = పిమ్మటనుండు లగ్నపరిమాణముచే విభజింప, లవాద్యం = భాగాది (స్యాత్ = అగును) తత్ = అది - అజాదిగృహైః = మేషము మొదలుకొని నైన - అశుద్ధపూర్వైః = తీవఁబడిన లగ్నముల సంఖ్యచేత, సహితం = రాశిస్థానములో గలుపఁబడినదై, అథ = పిమ్మట - అయనాంశ హీనం = అయనాంశలు తీవఁబడినదై - విలగ్నం = స్ఫుటలగ్నము - భవతి = అగుచున్నది॥ 2, 3.

ఉపపత్తి॥ అభీష్టకాలేయః క్రాంతిమండలప్రదేశః క్షితిజే లగ్నస్తల్లఘ్న మిత్యుచ్యతే - ఉక్తంచ సిద్ధాంతే॥ యత్రలగ్న మపమండలం కుజే తద్గృహాద్య మిహాలగ్నముచ్యతే॥ తచ్చలగ్న మవధేః సాధ్యం - అవధిస్తురవిః - తస్యమండలే స్థితత్వాత్ - సదైవ రవ్యుదయే రవి రేవ లగ్నం తస్య పూర్వగతిత్వేన తాత్కాలికం క్రియతే - ప్రవహాక్షిప్తమపమండలే ఇష్టఘటీషు ప్రత్యక్చలితం - తదా క్షితి జేఽపమండలప్రదేశో లగ్న స్తజ్జ్ఞానా రోపాయః - సాయనార్కేణ యద్భోగ్యం - తత్రికాలః సాధ్యతే - యది త్రింశద్భాగైః - 30 రవ్యాక్రాంతోదయఫలాని లభ్యంతే - తదా భోగ్యభాగైః కిమితి - ఏవం సత్ భోగ్యఫలాని ఇష్టఘటీపలేభ్యః శోధ్యాని - తతో యచ్ఛేషం తస్మాదుదయాః శోధ్యాః యావంతః శుధ్యంతి - తావంతః రాశయః రవా రోజ్యాః - యతో రవిరాశితోఽగ్రే లగ్నస్యైతావంతో రాశ యోజాతాః - తేను అశుద్ధపూర్వామేషాదయోరాశయ ఏరథకంతి - శుద్ధశేషపలే భ్యోఽంశానయన వాసనాఽను పాతా ద్యథా - యది అశుద్ధోదయపలైః త్రింశ ద్భాగాః లభ్యంతే - తదా శేషపలైః కిమితి - ఫలం భాగాదితదశుద్ధపూర్వమేషాది రాశియుక్తం లగ్నం స్యా దేవ - తత్రాయనాంశాహీనాః కార్యాః - యతః పూర్వం రోజితాః సంతి పూర్వ ముదయగ్రహణార్థం అయనాంశా రోజ్యాయేవయతః సర్వాణి విషువాయనచిహ్నాని సాయనా న్యేవ॥ 2, 3.

తా॥ తాను స్ఫుటముచేయు గడియలకుఁగల తాత్కాలిక రవిని స్ఫుటముచేసి అయనాంశలు గలిపి భాగాదిమాత్రము 30 భాగలలో తీవచ ఏష్యభాగలగును - సాయనరవియుండే లగ్నపరిమాణవిఘటికలచే భాగాదిని హెంచి 30 చేత విభజింప భోగ్య కాలమగును. ఇట్లే యాతాంశలచేత యాతకాలము సాధింపవలెను - అభీష్టవిగడియలనుండి భోగ్యకాలము తీవిచి పిమ్మట సాయనరవి యుండులగ్నము తరువాతలగ్నము మొదలుకొని యున్నలగ్నపరిమాణములు పోవునో అన్నియు తీవిచి మిగిలినదానిని

౩౦ చే గుణించి త్రోయఁబడని లగ్నపరిమాణముచే విభజింప భాగాది యగును-మేషాది యెన్నిలగ్నములు తీవఁబడునో అన్నిసంఖ్యలు రాశిస్థానమందుఁ గలిపి అయనాంశలు తీవఁగా స్ఫుటలగ్న మగును. 2, 3.

ఉదాహరణము॥ శోభకృతు సం॥ ర ఫాల్గుణ బ ౩౦ గురువారము ౧౦-౪౮ ఘ-భా ౮ = ౧౨ సూర్యపర్వావలోకనార్థం లగ్నస్ఫుటానయనమాహ.

పంచాంగస్థతిథ్యంత సమకలాగ్రహములు ఉదయాది ఘటికాః ౧౦ - ౪౮ ॥ రవి ౧౧ - ౩ - ౫౦ - ౫౭ గతి ౫౯ - ౮ చంద్రుఁడు ౧౧ - ౩ - ౩౫ - ౫౫ గతి ౭౨౨ - ౨౮ లంబనం ధనం ౧ - ౨౧ లంబనం సంస్కృతతిథ్యంతః ౧౨- ౯ కి చాలిత సమకలాగ్రహములు రవి ౧౧ - ౩-౫౨ - ౧౦ చంద్రుఁడు ౧౧-౩-౫౨-౧౦ రాహువు ౫ - ౫ - ౨౦ - ౨౭............ రవి ౧౧ = ౩ - ౫౨ - ౧౦ ÷ అయనాంశలు ౦ - ౨౩ - ౨ - ౦ = ౧౧ - ౨౬ - ౫౪ - ౧౦ సాయన రవి భాగాది ౩౦-౦-౦ లో సాయనరవిభాగాది ౨౬-౫౪-౧౦ తీవఁగా ౩-౫-౫౦ భోగ్యకాలము మీనస్వోదయం ౨౪౧ = ౭౪౬ - ౨౫ - ౫౦ ÷ ౩౦ = ౨౫ భోగ్యకాలము అభీష్ట ఘటికలు ౧౨ - ౯ వీని విగడియలు ౭౨౯—భోగ్యకాలము ౨౫= ౭౦౪ దీని మేషస్వోదయము ౨౪౧ వృషభోదయము ౨౬౯ తీవఁగా - గృహోదయశేషము ౧౯౪ × ౩౦=౫౮౨౦ ÷ మిథునప్రమాణము ౩౧౧=౧౮-౪౨-౪౯- శోధిత లగ్నములు ౨-౦-౦-౧ గలుపరాశ్యాది ౨-౧౮-౪౨-౪౯—అయనాంశలు ౦-౨౩-౨-౦=౧-౨౫-౪౦-౪౯ స్ఫుటలగ్నము.

యాతకాలమునకు సాయనరవిభాగాదిని ౩౦ లో నుండి తీవ నక్కరలేదు సాయనరవి ౧౧-౨౬-౫౪-౧౦ × మీనోదయము ౨౪౧=౬౪౮౩ - ౩౪ - ౧౦ ÷ ౩౦ = ౨౧౬ (యాతకాలము అనఁగా గతకాలము.) 2, 3.

అథభోగ్యకాలాదల్పే ఇష్టకాలసహిత లగ్నసాధనం

లగ్నాదిష్ట కాలజ్ఞానం చాహ.

శ్లో॥ భోగ్యతోఽల్పేష్టకాలాత్ ఖరామాహతా త్స్వోదయాప్తాం
శయుగ్భాస్కరః స్యాత్తనుః। అర్కభోగ్యస్తనో ర్భుక్తకాలా
న్వితో యుక్తమధ్యోద యోఽభీష్టకాలో భవేత్ ॥ 4.



టీ॥ భోగ్యతః = భోగ్యకాలముకంటె, అల్పేష్టకాలాత్, అల్ప = తక్కువది యగు = ఇష్టకాలాత్ = ఇష్టకాలమునుబట్టి - ఖరామాహతాత్ = ౩౦ చేగుణించుట వలన - స్వోదయాప్తాంశయుక్=స్వోదయ = తత్కాలసాయనరవియందు లగ్నప్రమాణముచేత, ఆప్త=భాగింపఁబడఁగా వచ్చిన, అంశ = భాగాదిని, యుక్ = కలుపఁబడిన, భాస్కరః = సూర్యుఁడు - తనుః = లగ్నము - స్యాత్ = అగును - అర్కభోగ్యః = రవిభోగ్యకాలము - తనోః = లగ్నముయొక్క, భుక్తకాలాన్వితః= లగ్నశోధ్యశేషము కలుపఁబడినదై - యుక్తమధ్యోదయః - యుక్త = కలుపఁబడిన మధ్యోదయః = సాయనసూర్యసాయన లగ్నములమధ్యలగ్నముయొక్క పరిమాణము గలదై, అభీష్టకాలః= కోరినకాలము - భవేత్ = అగును॥ 4.

ఉపపత్తిః॥ ఇష్టకాలే సూర్యా దుదయపర్యంతం ఇష్టకాలో వర్తతే - రవి భోగ్యభాగానాం కాల స్తదగ్రితో రాశ్యుదయా స్తతస్తదను భుక్తకాలే. తేషాం యోగ ఇష్టకాలో భవతీతి సుగమం - ప్రత్యక్షం గోళే చ దృశ్యతే॥ 4.

తా॥ భోగ్యకాలముకంటె ఇష్టకాలము తక్కువగా నున్నప్పుడు ఇష్టకాలమును - ౩౦ చే గుణించి సాయనరవియందు స్వోదయముచే విభజించి భాగాదిని స్ఫుటసూర్యునిలోఁ గలుప స్ఫుటలగ్నమగును - అర్కభోగ్యకాలమును లగ్నశోధ్యశేషమును గలిపి సాయనసూర్యసాయనలగ్నములమధ్య నుండులగ్నపరిమాణములఁ గలుప ఇష్టకాలము వచ్చును॥ 4.

ఉదాహరణము॥ సూర్యోదయాది ఇష్టకాలః గడి -౦-౧౦- భోగ్యకాలః-౨౫-సాయనరవిః-౧౧-౨౬-౪౨-౧౨ "స్ఫుటలగ్నసాధనం" ఇష్టకాలః-౦-౧౦ × ౩౦=౩౦౦ ÷ ౨౪౧=౧-౧౪-౪౧+ స్ఫుటరవి -౧౧-౩-౪౦-౧౨ గలుప -౧౧-౪-౫౪-౫౩ స్ఫుటలగ్నము... ఇష్టకాలసాధనం=ఇష్టకాలలగ్నం -౧-౨౩-౧౧-౨౦ + అయనాంశలు=౨-౧౬-౧౩-౨౦ సాయనలగ్నము - గతభాగలు ౧౬-౧౩-౨౦ × మిథునస్వోదయం ౩౧౧=౫౦౪౫-౬-౪౦ ÷ ౩౦=౧౬౮ తనోర్భుక్తకాలము + అర్కభోగ్యకాలము ౨౫=౧౯౩ + మేషం ౨౪౧ + వృషభం ౨౬౯=౭౦౩ ÷ ౬౦= ౧౧-౪౩ ఇష్టకాలము॥ 4.

అథ సాయనలగ్నార్కా ఏకరాశౌ యది తదా
ఇష్టకాలసాధన మాహ.

శ్లో॥ యదితనుదిననాథా వేకరాశౌ తదంశాంతరహత ఉదయః స్యా
ఖాగ్నిహృత్త్విష్టకాలః। ఇనత ఉదయ ఊన శ్చేత్సశోధ్యోద్యు
రాత్రాన్నిశితు సరసభార్కా త్స్యాత్తనూ రిష్టకాలే॥ ర.

టీ; తనుదిననాథౌ=లగ్నసూర్యులు - ఏకరాశౌయది = ఒకేరాశియందుండు నప్పుడు, తదంశాంతరహతః -తత్=ఆలగ్నసూర్యులయొక్క-అంశా=భాగలయొక్క- అంతర=అంతరముచేత - హతః=గుణింపఁబడిన - ఉదయః=లగ్నము - ఖాగ్నిహృత్= 30 చేత భాగింపఁబడినదై - ఇష్టకాలః = ఇష్టకాలము-స్యాత్ = అగును (దీనిని ౬౦ చే విభజింపవలెను) ఉదయః = సాయనలగ్నము - ఇనతః=సూర్యునికంటె - ఊనశ్చేత్ =తక్కువైనట్లయితే - సః = ఆ యిష్టకాలము - ద్యురాత్రాత్ = ౬౦ గడియలనుంచి - శోధ్యః = శోధింపబడవలెను - నిశితు - రాత్రియందైతే - సరసభార్కాత్ = షడ్రాశియుక్తమయినరవినుండి - ఇష్టకాలే = ఇష్టకాలమందలి - తనూః = లగ్నము - స్యాత్ = అగును॥ ర.

ఉపపత్తి॥ యది త్రింశద్భి ర్భాగైః సూర్యాధిష్ఠితోదయఫలాని - తదా త యో రంతరాంశైః కిమితి-ఫల మిష్టకాలః స్యాత్ - సూర్యా ల్లగ్నే ఊనే సూర్యోదయా త్పూర్వ మేవ భవిష్యతి - అతః స కాలః షష్టిశుద్ధ ఇత్యుక్తం - రాత్రౌ లగ్నసాధనార్థం రవిః సషడ్భిః కార్య ఏవయతః ప్రాక్పరత్ర క్షితిజ యో రంతరం షడ్రాశయ ఏవ భవంతి - అత ఉదయలగ్నషడ్రాశియుక్తం అస్తలగ్నం భవతి-యత్ "సిద్ధాంతే" యోఽభ్యుదేతి సమయేన యేన తత్సప్తమోఽస్తముప యాతి తేన చ॥ ర.

తా॥ లగ్నము, సూర్యుఁడు ఒకేరాశియందే యుండఁగా ఆ యంతరాంశలను రవియుండు లగ్నపరిమాణముచే గుణించి -30- చే భాగింప ఇష్టకాలమువచ్చును-



దీనిని - ౬౦ చే భాగింప ఇష్టకాలఘటికాది వచ్చును. (1) సూర్యునికంటె లగ్నము తక్కువగా నున్నప్పుడు రవిలోనుండి భాగాదిలగ్నము తీవిచి రవియుండులగ్న పరిమాణముచే హెచ్చి - 30 - చే భాగింపవలెను - రాత్రి యిష్టకాలమన్ననో - ౬౦- నుండి తీవచవలెను - ఇష్టకాల మగును॥ (2) రాత్రి యిష్టకాలమయినప్పుడు రవిలో ౬ రాసులు కలిపి యుంచి యిష్టకాలగడియలలో దినపరిమాణము తీవచ అస్తమయాదియిష్టకాల మగును - దానిని ౬౦ చేఁ హెచ్చి యిష్టఘటికలు తీవిచి షడ్రాశి యుక్తుఁడగురవియున్న రాశికిఁ దిమ్మట రాశినుంచి లగ్నప్రమాణముల అయిదింటి మొత్తమును పైదానిలో తీవిచి - 30 - చే గుణించి రవియుండు రాశిపరిమాణఘటి కలచే భాగింప భాగాది వచ్చును - పిమ్మట రవియుండులగ్నము - రాశిస్థానమందుంచి అయనాంశలు తీవచ స్ఫుటలగ్న మగును. (3) ర.

ఉదాహరణము॥ "(1)సాయనరవి-౧౧-౨౬-౪౧-౧౨-సాయనలగ్నం-౧౧-౨౭-౫౬-౫౩-అంతరం-౦-౧-౧౫-౪౧ మీనోదయం-౨౪౧చేఁ హెచ్చ- ౩౦౩-౫౯-౪౧ ÷ 30=౧౦విగడియలిష్టకాలము॥" "(2)పూర్వదినే ఉదయాదిష్టకాలః-౫౭-౦-కి సాయనరవి-౧౧-౨౬-౩౯-౪ సాయనలగ్న ౦-౧౧-౧౧-౫౬-౫౩ అంతరం౦౪-౪౨-౧౧ మీనోదయేనగుణితలబ్ధం-౩౫౪౩-౨౬-౧౧ ÷ ౧౧౭ అహోరాత్రిపరిమాణము ౬౦ తీవచ - ౫౭-౦-ఇష్టకాలము - రాత్రిశేషం - ౨ - ౦ - గడియలు" "(3) ఉదయాది యిష్టకాలము ౫౭-౦-కి రాత్రిలగ్నస్ఫుటానయనము॥ సాయనరవి- ౧౧-౨౬-౩౯-౪- ఆఱురాసులు తీవచఁగా ౫-౨౬-౩౯-౪ కన్యాలగ్నములో నుండెను - ఇష్టకాలము ౫౭-౦-దినపరిమాణము ౨౯-౫౪ నుతీవచ ౨౭-౬ అస్తమయాది ఇష్టకాలము, దీని విగడియలు ౧౬౨౬ ఇష్టకాలమును తీవచఁగా-౧౬౨౭ - దీనిలో నుండితుల-వృశ్చికధను ర్మకర-కుంభముల మొత్తం ౧౫౩౫ ను తీవచఁగా -౯౩ - దీనిని 30 చేఁ హెచ్చ - ౨౮౯౦ ÷ మీనోదయము - ౨౪౧ = ౦-౧౧-౩౪-౩౬ రవియుండు రాశిమీనముగాన దీనిలో పదకొండురాసులు గలుప ౧౧-౧౧-౩౪-౩౬ ఆయనాంశలు-౨౩-౨-౦-తీవచఁగా-౧౦-౧౮-౩౨-౩౬ స్ఫుటలగ్నమయ్యెను". ర

అథగోళాయనదినరాత్ర్యర్ధతథాంశజ్ఞానంచాహ

శ్లో॥ గోళా స్తః సౌమ్యయామ్యౌ క్రియఘటరసభే ఖేచరేఽ
థాయనే తే నక్రాత్కర్కాచ్చ షడ్భేఽథచరపలయుతో నాస్తు పం

చేందునాడ్యః । ఘుస్రార్ధం గోళయోః స్యాత్తదయుతఖగుణాః స్యాన్నిశార్ధం తథాక్షచ్ఛాయేషుఘ్నాక్షభాయాః కృతిదశమలవోనా యమాః శాపలాంశాః॥ 6.

టీ॥ ఖేచరే=సాయనగ్రహము, క్రియధటరసభే, క్రియ=మేషము, ధట=తుల (మొదలు) రసభే = ఆరురాసులను బొందినదగుచుండగా, సౌమ్యయామ్యౌ = ఉత్తరదక్షిణములయిన- గోళౌ = గోళములు - స్తః = అగును-అథ = పిమ్మట- నక్రాత్ = మకరరాశినుంచియు-కర్కాత్=కర్కటరాశినుంచియు- షడ్భే=ఆఱు రాసుల (వంతున) అయనే ఉత్తరాయణ దక్షిణాయనములు - స్తః = అగును- అథ = పిదప - పంచేందునాడ్యః=౧౫ గడియలు-గోళయోః=ఉత్తర దక్షిణగోళములయందు - చరపలయుతోనాః- చరపల=చరపలలగు విలిప్తలు- యుతః = కలుపఁబడినవియు- ఊనాః = తీసివేయబడినవియు (అయి) ఘుస్రార్ధం = దినార్ధము - స్యాత్ = అగును - తదయుతఖగుణాః = తత్ = ఆదినార్ధము-ఖగుణాః=30 లో, అయుత = తీసివేఁబడినదై - నిశార్ధం = రాత్ర్యర్ధము- స్యాత్ = అగును - అథ = పిమ్మట- అక్షచ్ఛాయేషుఘ్నీ- అక్షచ్ఛాయా = విషువచ్ఛాయ - ఇషుఘ్నీ = ౫చే గుణింపఁబడినదై - అక్షభాయాః = విషువచ్ఛాయయొక్క - కృతిదశమలవోనా - కృతి = వర్గుయొక్క -దశమలవః = ౧౦ యవ భాగము - ఊనా = తీసివేయబడినదై- యమాశాపలాంశాః - యమాశా = దక్షిణదిక్కుయొక్క - పలాంశాః=అక్షాంశలు- స్యుః = అగును॥ 6.

ఉపపత్తిః॥ గోళాయనవిషయే॥ క్రాంత్యభావో యత్ర సగోళాదిః క్రాంత్యభావః సాయనభుజాభావే భుజాభావో మేషాదౌ తులాదౌ - అతస్తౌగోళసంధీ మేషాది షడ్రాశయః భచక్రే ఉత్తరార్థే సంత్యత ఉత్తరగోళః - తులాదయోదక్షిణార్థతః సదక్షిణగోళ ఇతి యుక్తి పరమక్రాంతిస్తు భుజపరమత్వే-భుజపరమత్వంచ కర్కాదౌ మకరాదౌచ భవత్యతస్తావయనసంధీ "(1) దినరాత్రివిషయే" నిరక్షదేశే అహోరాత్రవృత్తే ఉన్మండలాత్ - యామ్యోత్తర వృత్తసంపాతం యావత్సదా పంచదశ ఘటికా భవతి క్షితిజోన్మండలయోరేకత్వాత్ - తథా ప్రవహాక్షిప్తచక్రస్య సమ



పూర్వాపరభ్రమణత్వాత్ - అన్యదేశే క్షితిజోన్మండలయో ర్భిన్నత్వాత్ - తదంతర వినాడీభిః ఊనాధికాః పంచదశ ఘటికాః సంభవంతి - ఉన్మండలక్షితిజయోరంతరం చరం - ఉక్తంచ భాస్కరాచార్యేణ "ఉన్మండలక్ష్మావలయాంతరాళే ద్యురాత్రవృత్తే చరఖండకాల" ఇతి ఉత్తరగోళే ఉన్మండలాదధః క్షితిజం స్థితం - తస్మాచ్చరేణాధికాః పంచదశఘటికాః క్రియంతే - తద్దినార్ధం స్యాత్ - యామ్యేతు ఉన్మండలా దూర్ధ్వం క్షితిజం తస్మాత్తదూనా ఏవ దినదళం స్యాత్ - తత్ త్రింశత్ శుద్ధం రాత్రిదళం స్యాదేవ - తే ద్విగుణె దినరాత్రిమానే క్షితిజాదస్తక్షితిజం- యావత్ అహోరాత్రవృత్తే యావంత్యో ఘటికాస్తావద్దినం క్షితిజాదా విభాగా దస్తక్షితిజ పర్యంతం రాత్రిమానం-తత్సర్వం గోళోపరి దర్శయేత్- వాసనామాత్రముక్తం"(2)అక్షాంశవిషయే" యదిపలకర్ణే పలభా భుజః - తదా త్రిజ్యాకర్ణేకః - ఫల మక్షజ్యాతద్ధను రక్షాంశాః జాతాః - ధనురాయనవాసనా పూర్వోక్తైవ - అత్రై) కాంగుళాం పలభాం ప్రకల్ప్య అక్షాంశాః సాధితాః-౮-౫౮-య ద్యేకాంగుళయా పలభయా ఏతే తదేష్టయా క ఇతి - ఏభిః పలాంశాః గుణ్యా ఇత్య త్రైరాశికం పంచైవ గృహీతాః - అతః పంచగుణ పలభాపలాంశాఇతి - అధికం ఖండం గృహీత మిదం - ౦-౬-౫ దం పలభావర్గస్య దశమాంశేన సమం - అత స్తదూనా ఏవ కార్యాః - అధికస్య గృహీతత్వాత్ తే సదా దక్షిణా ఏవ - యతో లంకాతః ఉత్తరే సమమండలాన్నాడికామండలం దక్షిణత ఏవ సదా వర్తతే - లంకాయా దక్షిణె మనుష్య సంచార ఏవ నాస్తి - అతస్తే నోక్తాః॥ (3) 6.

తా॥ రవి మేషాదిషట్కములయం దుండునప్పుడు ఉత్తరగోళమనియు తులాదిషట్కములో నుండునపుడు దక్షిణగోళమనియు - మకరాదిషట్కములో నుండునపుడు ఉత్తరాయణమనియు కర్క్యాదిషట్కములోనుండునపుడు దక్షిణాయనమనియుఁ జెప్పఁబడును. లంకాదినార్ధయగు ౧౫ గడియలలో మేషాదిషట్కసమయ చరపలము ధనమును తులాదిషట్క సమయచరపలము ఋణమును జేయ స్వదేశాహర్దళమగును - 30 గడియలలో అహార్ధను తీసివేఁగా రాత్ర్యర్ధ యగును - విషువచ్ఛాయను ౫చే పెంచి విషువచ్ఛాయ యొక్కవర్గులో ౧౦ వ భాగమును తీసివేఁగా అక్షాంశ లగును - ఇవి సదాదక్షిణాక్షాంశ లని చెప్పఁబడును॥ 6.

ఉదాహరణము॥ స్ఫుటరవి ౧౧-౩-౪౦-౧౨ ఇప్పుడు ౧౧ రాసులు గతించి పండ్రెండవ రాశిలో (మీనములో) నున్నందున మీనము తులాదిషట్కమగుటచే దక్షిణగోళమనియు మకరాదిషట్క మగుటచే ఉత్తరాయణమనియుఁ దెలియవలెను. లంకాదినార్ధ ౧౫-౦ చరవిలిప్తలు -౦-౧౫ ఋణముచేయ ౧౪-౪౫ దినార్ధము -౩౦-౦—౧౪-౪౫=౧౫-౧౫ రాత్ర్యర్ధము॥ విషువచ్ఛాయ ౩-౪౩×౫=౧౮-౩౫॥ ౩-౪౩×౩-౪౩=౧౩-౪౮ వర్గ÷౧౦=౧-౨౨ను ౧౮-౩౫లో తీసివేయఁగా ౧౭-౧౩ అక్షాంశలు వర్గగణితవిధి.

```
౩-౪౩           ౩-౪౩
౩-౩            ౪౩-౪౩
౯-౧౨౯-౧౨౯) ౬౦ (౧౮౪౯
        ౧౨౯
        ౩౦           ౩౦
   ౬౦ | ౨౮౮
        ౪-౪౮
        ౯-

        ౧౩-౪౮ వర్గ.
```

అథ నతోన్నత సంజ్ఞా - అక్షకర్ణజ్ఞానం చాహ.

శ్లో॥ యాతః శేషః ప్రాక్పరతోఽన్నతం స్యా త్కాల స్తేనోనం ద్యుఖండం నతం స్యాత్ । అక్షచ్ఛాయావర్గతత్త్వాంశయుక్తా మార్తండాః స్యా దంగుళా ద్యోఽక్షకర్ణః॥ 7.

టీ॥ ప్రాక్ = సూర్యోదయాది దినార్ధపర్యంతం - యాతః = గతకాలము - ఉన్నత=పూర్వోన్నతము - స్యాత్ = అగును - పరతః=దినార్ధాత్పరము - శేషః = మిగిలినకాలము - ఉన్నతం = పశ్చిమోన్నతము - స్యాత్ = అగును - తేన = ఆ యున్నతముచేత - ఊనం = తీసివేయఁబడిన - ద్యుఖండం = దినార్ధము - నతం = నతము - స్యాత్ = అగును- అక్షచ్ఛాయా వర్గతత్త్వాంశయుక్తాః - అక్షచ్ఛాయా =



విషువచ్ఛాయయొక్క - వర్గ = వర్గముయొక్క - తత్త్వాంశ=౨౫-వ వంతు-యుక్తాః= కలుపఁబడినట్టివంటి - మార్తాండాః = ౧౨౦అంగుళాద్యః = అంగుళ వ్యంగుళ ములుగల - అక్షకర్ణః = అక్షకర్ణము - స్యాత్ = అగును॥ 7.

ఉపపత్తిః॥ దినకరకరనికరనిహతతమసో నభసో వృత్తాకారత్వేన ప్రతిభాసతే తస్య యామ్యోత్తరవృత్తమవధిం కృత్వా ద్వే కపాలే పరికల్పితే - తత్ర యత్రస్థోరవి రుదయం యాతి - తత్పూర్వకపాలం యత్రాస్త ముపయాతి - తత్పశ్చిమకపాలం - యతో రవి రేవ పూర్వాది దిగభివ్యంజకః - తతః పూర్వక్షితిజాద్యావ తాభీష్టకాలేన రవిరున్నత స్తావా నున్నతకాల ఇత్యభిధీయతే - అపరకపాలేఽస్తక్షితిజా ద్యావాన్ శేషకాలః - స ఉన్నతకాలః స్యాత్ - ఉన్నతం కాలది నార్ధా దపాస్య - యః శేషకాలః తేనరవి ర్మధ్యాహ్న తో నతో భవతి-అపరకపాలే రవిజనార్ధయో రంతరే యః కాలః స ఏవ నతో భవతి-మధ్యాహ్న ద్రివేస్తావతా కాలేన నతత్వా దితి॥ (1) అక్షకర్ణవిషయే॥ పలభా భుజః ద్వాదశాంగుళశంకుః కోటిః - పలకర్ణః కర్ణ ఏవం పలభావర్గో ద్వాదశవర్గయుక్తః - తస్యమూలం పలకర్ణః స్యాత్ - అత్రైశాంగుళపలభాయాం జాతః పలకర్ణః -౧౨-౨-౨౪ అస్మాద్ద్వాదశవిశోధ్య శేషం ౦-౨-౨౪ ఇదం పలభావర్గతత్త్వాంశతుల్యం - అత స్తద్యుక్తాః - ద్వాదశపలకర్ణాః స్యా దిత్యుపపన్నం॥ (2) 7.

తా॥ సూర్యోదయాది దినార్ధపర్యంతము పూర్వకపాల మనియు- మధ్యాహ్న ప్రభృతి సూర్యాస్తమయపర్యంతము పశ్చిమకపాల మనియుఁ జెప్పఁబడును-ప్రాక్కపాలమందు సూర్యోదయాదీష్ట కాలపర్యంతము గతఘటికలు ఉన్నత మనియు-పశ్చిమ కపాలమందు పశ్చిమోన్నత మనియుఁ జెప్పఁబడును - ఉన్నతమును దినార్ధములో నుండి తీసివేయఁగా నత మగును - విషువచ్ఛాయను వర్గించి దాని ౨౫-వ భాగము ౧౨- లోఁ గలిపి అంగుళాద్యక్షకర్ణ మగును॥ 7.

ఉదాహరణము॥ దినార్ధము ౧౪-౪౫ ఇష్టకాలము ౧౧-౪౩ ను తీసివేయఁగా- ౩-౨ పూర్వనతము పూర్వకపాల మగుటచే ఉన్నతమనఁబడును - అక్షచ్ఛాయ ౩-౪౩ వర్గ ౧౩-౪౮ దీని ౨౫ వంతు -౦-౩౩ ఇందుఁ జేర్పఁగా-౧౨-౩౩ అంగుళాద్యక్షకర్ణము॥ 7.

అథ హారాయన మహ.

శ్లో॥ వేదేశాః శరహృచ్చరాఢ్యరహితాః సౌమ్యాన్యదగ్గోళయో। స్వార్ధోఽర్ధో ఘటికార్ధయుజ నతకృతే ర్ద్వ్యంశః సమాఖ్యః స్మృతః। చేత్సార్ధత్రికుతో నతం య దధికం వేదాహతం తద్వియుక్ స్పష్టోఽసౌ తదయుక్ హర స్త్వభిమతః స్యాద్ధతకర్ణోద్ధృతః॥ ౮.

టీ॥ వేదేశాః=౧౧౪-సౌమ్యాన్యదగ్గోళయోః=ఉత్తరదక్షిణగోళములయందు-శరహృచ్చరాఢ్యరహితాః - శరహృత్=౫-చే భాగింపబడిన - చర = చరవిలిప్తలు - ఆఢ్య=ఉత్తరగోళములోఁ గలుపఁబడినవిన్ని - రహితాః = దక్షిణగోళములోనుండి తీవఁబడినవిన్ని అయి - హారః =హారము-స్యాత్=అగును-అథ-పిమ్మట ఘటికార్ధయుక్=౩౦ విగడియలు కలుపఁబడిన - నతకృతేః = నతవర్గముయొక్క - ద్వ్యంశః = ౨-వ వంతు - సమాఖ్యః=సమాఖ్యయని-స్మృతః= చెప్పఁబడును - చేత్ = ఒకప్పుడు - నతం=నతము-యత్ = ఎప్పుడు- సార్ధత్రికుతః= ౧౩½ పదమూడున్నర గడియలకంటె - అధికం = ఎక్కువ (స్యాత్ = అగునో - తదా = అప్పుడు-సార్ధత్రియో దశహీనం = ౧౩-౩౦ తీవఁబడిన దానినిగా - కృత్వా = చేసి) వేదాహతం = ౪ చే గుణింపఁబడినదై = తద్వియుక్ = అది, మధ్యహారములోఁగలుపబడి - అసౌ = ఇది - స్ఫుటః = స్పష్టమయినది - స్యాత్ = అగును - తదయుక్=అది ౧౩-౩౦ కంటె తక్కువగా నున్నప్పుడు సమాఖ్యచేఁ తీవఁబడిన - హారః = మధ్యహారము - అక్షకర్ణోద్ధృతః = అక్షకర్ణముచేత భాగింపఁబడినదై - అభిమతః=ఇష్టహారము-స్యాత్= అగును॥ ౮.

ఉపపత్తిః॥ అత్రిగోళే అహోరాత్రవృత్తే క్షితిజసంపాతయోర్బద్ధం సూత్రం - తమదయాస్తసూత్రం ఏవ మున్మండలసంపాతయో ర్బద్ధం తదహోరాత్ర వ్యాససూత్రం తదుదయాస్తసూత్రయోః అంతరం చరజ్యైవ - అథ యామ్యోత్తరవృత్త సామ్యోత్తరయోర్బద్ధం - తన్నతం తస్య వ్యాససూత్రం - తయోర్వ్యాససూత్రయో ర్యః సంపాత స్తస్మాదుపరితనం ఖండం ద్యుజ్యా - సా ఉత్తరగోళే అథ స్తనయా



కుజ్యయా యుతా యావత్ క్రియతే తావద్దినార్ధే అర్కోదయాస్త సూత్రయోరం తరం స్యాత్ - దక్షిణే తు కుజ్యయా హీనా యుతః - అర్కోదయాస్త సూత్రా దధః తరం స్యాత్ - దక్షిణే తు కుజ్యయా హీనా యుతః - అర్కోదయాస్త సూత్రాదధః కుజ్యా యదర్కోదయాస్తసూత్రయో రంతరం సాత్ర హృతి రిత్యుచ్యతే, ఏవ మంత్యాపి చరజ్యయా త్రిజ్యాయుతో నాదినార్ధాంత్యా స్యాత్ - అహోరాత్రవ్యా సార్ధం త్రిజ్యాతుల్యై రంకై రంక్యతే తావ త్త్రిజ్యాతుల్యం భవతి - తై రంకై ర్యావత్ కుజ్యా గుణ్యతే - తావ చ్చరజ్యా తుల్యా భవతి - అత శ్చరజ్యయా త్రిజ్యా - యుతో సాంత్యా సంజ్ఞా భవతి - నాంత్యాహృతో ర్వః క్షేత్రసంస్థానభేదః - కిం తు అంకానాం గురులఘుత్వాత్ కేవలః సంఖ్యాకృతో భేద ఇత్యుపపన్నం, అత్ర తావత్ అంత్యార్థం చరజ్యా సాధ్యా - సా యథా - చరపలాని షష్టిభక్తాని నాడ్యః స్యుః- తాః షడ్గుణాః భాగాః స్యుః- తే ద్విగుణాః జీవా - అత్ర చరపలా నాం హారః- ౬౦ - గుణద్వయఘాతో గుణః - ౧౨ - గుణహారయోః గుణోనాప వర్తితయోః లబ్ధాః పంచ - అత ఉక్తం శరహృచ్చరేణేతి - శరహృచ్చరం చరజ్యా జాతా తయా త్రిజ్యా సౌమ్యయామ్యగోళయోః క్రమేణ యుతోనా కార్యా - అత్రాచార్యేణ త్రిజ్యా వేదేశమితా ధృతా, - అతో వేదేశా ఇతి - ఏవం జాతా దినార్ధాంత్యా తస్యాః హారసంజ్ఞా కృతా - ఇయం దినార్ధాంత్యా నతోత్క్రమజ్యయా హీనా సతీ ష్టాంత్యా స్యాత ఏవ మత్ర నతోత్క్రమజ్యా ఘటికార్ధయుక్తస్య నతస్య వర్గేణ దళితేన తుల్యా భవతి - అత్ర ప్రతీత్యర్థం కల్పితం నతం - ౫ - ఇదం షడ్గుణ మంశః - ౩౦ - ఏషాం ఖార్కే - ౧౨౦ - మితే వ్యాసార్ధే ఉత్క్రమజ్యా -౧౬- యది ఖార్కే మితే వ్యాసార్ధే ఇయం తదా వేదేశతుల్యే కేతిజాతాః = ౧౫-౧౨ ఘటికార్ధసంయుక్తం నతం - ౫=౩౦-అస్యవర్గః - ౩౦-౧౫-తదర్ధం - ౧౫-౭-ఏవం స్వల్పాంతరా జాతానతోత్క్రమజ్యైవ - తస్యాః సమసంజ్ఞా కృతా - చే న్నతం సార్ధత్రయోదశాధికం స్యాత్తదా తత్సార్ధత్రయోదశహీనం కృత్వాయదధికం త ద్వేదైః కృతుర్భిః ఆహతం గుణితం తేన వియుక్హీనః సమాఖ్యః స్ఫుటః స్యాత్ - తేన సమాఖ్యేన అయుక్హీనః హారః అక్షకర్ణేన. ఉద్ధృతో భక్తః ఇష్టహారః స్యా దిత్యర్థః। అత్ర సమాభిధాయానతోత్క్రమస్యాసాధితా సా సార్ధత్రయోదశనత పర్యంతం భవతి - తతః పరం సాంతరా - అత్ర కల్పితం నతం - ౧౪ - ౩౦ అస్య

నతస్య వేదేశతుల్యా ఇతి - ౧౧౪ - త్రిజ్యాయా ముక్త్రిమజ్యా - ౧౦౭-౩౦-ఘటి కార్ధయుక్తనతస్య ౧౫ వర్గోద్వ్యాప్తః - ౧౨-౩౦-అత్రానయో రంతరం చత్వా రః-౪ - తదంతర మేకఘటికాయాం చతుర్మితం - తత్రానుపాతః - యద్యేకఘటి కాయాం చత్వారోంతరం - తదేష్టేన సార్ధత్రయోదశాధికేన నతేన కి మితి - ఫలం హీనం కార్యం అధికభూతత్వాత్ - తతస్తేనహీనో హార ఇష్టహారః స్యాత్ - యతోనతోత్క్రమజ్యాహీనాదినార్ధాంత్యా ఇష్టాంత్యా భవతి-సా ఇష్టహారసంజ్ఞా- అత్రాక్షకర్ణాభజనే యుక్తి స్త్వనుపద మేవ స్పష్టీకరిష్యతే॥ ౮.

తా॥ రవి ఉత్తరగోళమందుండునపుడు చరవిలిప్తలను ౫-చే భాగించి విభక్త ము ౧౧౪ లోఁ గలుపవలెను - దక్షిణగోళ మైనప్పుడు తీవచవలెను. మధ్యాహార మగును - పిమ్మట - ౯-౦-౩౦ లో నతముఁ గలిపి వర్గుచేయ దానియొక్క రెండవ వంతు సమాఖ్య యనఁబడును - హారములో సమాఖ్యను తీవిచి అక్షకర్ణముచే భా గింప ఇష్టాహార మగును - నతము ౧౩-౩౦-కంటె నధికముగానున్నప్పుడు దానిలో ౧౩-౩౦ తీవిచి ౪-చేఁ హెంచ సమాఖ్య యగును - దీనిని మధ్యాహారములోఁ గలిపి అక్షకర్ణముచే భాగింప అభిమతాహార మగును॥ ౯.

ఉదాహరణము॥ చరవిలిప్తలు ౧౪ దీనిని ౫-చే భాగింప - ౨ - ౪౭ ఇది ౧౧౪-లో నుంచి తీవచఁగా ౧౧౧-౧౨ మధ్యాహారము - నతం - ౩-౨ ఇందులో- ౦-౩౦ కలుప-౩-౩౨ దీనివర్గు ౧౨-౪౯ రెండవవంతు-౬-౧౪-ఇదిసమాఖ్య-మధ్యా హారములోనుండి తీవచ-౧౦౪-౫౭-అక్షకర్ణము - ౧౨-౩౩చే భాగింప-౭-౨౧ఇష్టా హారము..............౧౪-౨౦ నత మయినప్పుడు దీనిలోనుండి ౧౩-౩౦ తీవచఁ గా - ౦-౫౦×౪ = ౩-౨౦ మధ్యాహారము +౧౧౧-౧౨=౧౧౪-౩౨ దీనిని అక్ష కర్ణముచే భాగింప - ౯ - ౭ ఇష్టాహార మగును॥ ౮.

అథ భాజ్య - ఇష్టకర్ణ - ఛాయాజ్ఞానంచాహ.

శ్లో॥ దిఘ్నాక్షభోహృతచరం స్వగుణం ద్వినిఘ్నం స్వేష్వంశ యుగ్యు
గభవాన్విత మత్రిభాజ్యః। కర్ణోంగుళాదిక ఇహేష్టహారాప్త
భాజ్యః కర్ణార్కవర్గవివరా త్పదమిష్టభా స్యాత్॥ ౯.



టీ॥ దిఘ్నాక్షభాహృతచరం-దిక్=౧౦ చేత, ఘ్న = గుణింపఁబడినటువంటి, అక్షభా=విషువచ్ఛాయచేత, హృత=భాగింపఁబడిన, చరం=చరవిలిప్తలు, స్వగుణం= వర్గింపఁబడినదై, ద్వినిఘ్నం=౨ చే గుణింపఁబడి, స్వేష్వంశయుక్ = దాని యయి దవవంతు కలుపఁబడి, యుగభవాన్వితం=౧౧౪ చేఁగలుపఁబడినదై, అత్ర=యిచ్చట, భాజ్యః = భాజ్యము, స్యాత్ = అగును, ఇష్టహారాప్తభాజ్యః = ఇష్టహారముచేత భాగింపఁబడిన భాజ్యము, ఇహ=ఇక్కడ, అంగుళాదికః = అంగుళవియంగుళములు గల, కర్ణః=కర్ణము, స్యాత్ = అగును, కర్ణార్కవర్గవివరాత్-కర్ణ = కర్ణము యొక్కయు, అర్క=౧౨ యొక్కయు, వర్గ=వర్గముల, వివరాత్= అంతరమువల్ల నుంచి, పదం=వచ్చిన మూలము, ఇష్టభా=ఇష్టచ్ఛాయ, స్యాత్ =అగును॥ ౯.

ఉపపత్తిః॥ ఇష్టహారసంజ్ఞేష్టాంత్యాజ్ఞాతాస్తి - తస్యాః హృతికరణా యాను పాతః- త్రిజ్యావృత్తే ఇయ మంత్యా తదా ద్యుజ్యావృత్తే కేతి - జాతేష్టహృతిః- పరకర్ణే ద్వాదశకోటి స్తదేష్టహృతికర్ణే కేతి-జాతా ఇష్టశంకుః - శంకుకోటౌ కర్ణ స్త్రిజ్యా తదా ద్వాదశకోటౌ కఇతి-జాత- ఇష్టకర్ణః- ఏవ మత్ర త్రిజ్యావర్గస్య పలకర్ణోగుణః- ద్యుజ్యేష్టాంత్యాఘాతో హారః తేన త్రిజ్యావర్గో ద్యుజ్యాభక్తః- ఫలస్య భాజ్యసంజ్ఞాకృతా - తత్ర పరమాల్పద్యుజ్యయా - ౧౦౭ - ౪౦ - త్రిజ్యావర్గే భక్తే జాతఃపరమో భాజ్యః - ౩౧ - ౨౦ సార్కమితే వ్యాసా ర్ధేఽయం తదా వేదేశమితేక ఇతి - జాతో భాజ్యః-౧౨౪-౪౫ - సభాజ్యఫలకర్ణగుణా ఇష్టాంత్యా భక్తః కార్యః - తత్ర పలకర్ణగుణేన గుణహారాపవర్తితా - ఏవం ఫలకర్ణే భక్తే ష్టాం త్యై వేష్టహారసంజ్ఞా కృతా - అత ఇష్టహారాప్తభాజ్యఇష్టకర్ణః స్యా దిత్యుపపన్నం - అస్య సాధనప్రక్రియా ద్యుజ్యాకాంత్యిజ్యా వినా నసిద్ధ్యతి - తత్ ప్రక్రియాగౌరవ మతోఽనుకల్పేన దిఘ్నాక్షమ యేత్యాదినా భాజ్యోజ్ఞాతః - అనుకల్పః స యథా ఏకాంగుళపలభాయాం ఖండత్రయయోగః పరమం చరం - ౨౧-౨౦ ఇదం దశగుణ పలభాభక్తం - ౨-౭ వర్గితం - ౪-౩౩ - ద్విగుణం-౯-౬-ఇదం స్వపంచాంశయు తం-౧౦-౫౫ వేదేశయుతం స ఏవ భాజ్యఇతి ప్రతీతః - అయం భాజ్యో హారహ తోఽభీష్టకర్ణో భవతి - ఇతి యుక్తిః పూర్వమేవోక్తా కర్ణార్కవర్గద్వాదశ వర్గాంతరా న్మూలం - ఇష్టభా ఇష్టఛాయా స్యాత్ -అస్యోపపత్తిః - ఛాయాభుజః- ద్వాదశాంగుళశంకుః ‘ కోటిః ఛాయాకర్ణః - అతః కోటికర్ణయో ర్వర్గాంతరమూలం ఛాయా భవతీ త్యుపపన్నం॥ ౯.

తా॥ విషువచ్ఛాయను ౧౦ చేఁ బెంచి దానిచేత చరవిలిప్తలనుభాగించి వచ్చిన దానిని వర్గించి ౨ చే గుణించి దాని అయిదవవంతును గలిపి - ౧౧౪ గలుప భాజ్య మగు ఈభాజ్యమును ఇష్టాహారముచే భాగింప అంగుళాది కర్ణ మగును - ఈ కర్ణము యొక్కయు ౧౨ యొక్కయు వర్గలయంతరము వల్లనుంచి వచ్చుమూలము ఇష్టచ్ఛా య యగును॥ 9. ఉదాహరణము॥ విషువచ్ఛాయ-3-౪3 × ౧౦=3౭-౧౦ చేత చర విలిప్తలగు ౧౪ ను భాగింప - ౦ - ౨౨ దీనివర్గ-౦-౮-ద్విగుణింప-౦-౧౬ అయి దవవంతుఁగలుప-౦-౧౯ దీనిలో - ౧౧౪ గలుప - ౧౧౪ - ౧౯ ఇది భాజ్యము - దీనిని ఇష్టాహారమగు - ౮-౨౧ చే విభజింప-౧3-౪౧ ఇది యిష్టకర్ణము - దీనివర్గ- ౧౮౭-౧౪ ను ౧౨ యొక్కవర్గ ౧౪౪ ను వీని అంతరము - ౪3 - ౧౪ దీనిమూలము ౬-3౬ ఇది ఇష్టఛాయ యగును॥ 9.

అథ ఇష్టచ్ఛాయయాకర్ణ - నతజ్ఞాన మాహ.

శ్లో॥ కర్ణ స్స్యాత్పదమర్కభాకృతియుతే స్తద్భక్తభాజ్యో హ
రోఽభీష్ట స్తత్ఫలకర్ణఘాతరహితో మధ్యో హరో ద్వ్యాహతః।
చేద్వేదాంకధరాధికః పృథగతో వేదాంకభూనా ద్గుణాప్తాఢ్య స్త
స్య పదం ఘటీముఖనతం స్యాదర్ధనాడీ వియుక్॥ 10.

టీ॥ అర్కభాకృతియుతేః - అర్క = ౧౨ యొక్కయు, - భా = ఇష్ట చ్ఛాయయొక్కయు, కృతి = వర్గలు - యుతేః = కలిపినదానియొక్క, = పదం = మూలము - కర్ణః = కర్ణము, స్యాత్ = అగును - తద్భక్తభాజ్యః - తత్ = అక ర్ణముచేత, - భక్త = భాగింపఁబడిన - భాజ్యః = భాజ్యము - అభీష్టః = ఇష్టమయిన టువంటి - హారః = హారము - స్యాత్ = అగును - తత్ఫలకర్ణఘాతరహితః—తత్ఫ ల = అహారమగుఫలము, - కర్ణ = కర్ణముచేత, - ఘాత = గుణింపఁబడినదై, - రహి తః = తీవచఁబడినటువంటి, మధ్యః = మధ్యమమయిన - హారః - హారము, ద్వ్యా హతః = రెండుచే గుణింపఁబడినదై - వేదాంకధరాధికశ్చేత్ = ౧౯౪ కంటె నె క్కువదిరైనప్పుడు - పృథక్ = ప్రతిగానుంచఁబడి - అతః = దానినుండి - వేదాం కభూనాత్ = ౧౯౪ ను తీవిచిన దానినుంచి - గుణాప్తాఢ్యః = 3 చేత భాగింపఁ



బడినదై, అఢ్యః=ప్రతిగానుంచిన దానితోఁ కలుపబడినదై, తస్య=దానియొక్క, పదం=మూలము, అర్ధనాడీవియుక్=30 విగడియలు తీవచబడినదై, నతము=౧3-30 కంటె, నధికముగా నున్నప్పుడు కలుపబడినదై, నతం=గడియలు మొదలుగాగల, నతము=స్యాత్=అగును॥ 10. (ఉపపత్తిః॥ విలోమవిధినా ప్రసిద్ధైవ॥ 10.)

తా॥ ౧౨ యొక్కయు ఇష్టచ్ఛాయయొక్కయు వర్గలను గలిపి మూలము చేయ కర్ణమగును. ఆ కర్ణముచేత భాజ్యమును భాగింప అభీష్టహార మగును. ఆహారము కర్ణముచే గుణింపఁబడి మధ్యాహారములో తీవచఁబడి ౨ రెండుచే గుణింపఁబడిన దానిమూలములోనుండి 30 విగడియలు తీవచబడుట చేత గడియలాదిగా నతమువచ్చును. మధ్యాహారములోనుండి తీవిచి రెట్టించినపిమ్మట ౧౯౪ కంటె నధికముగానున్నప్పను ౨ ప్రతులు పెట్టి రెండవప్రతిలో ౧౯౪ తీసి వేసి శేషమును 3 చే భాగింపఁగా వచ్చిన విభక్తమును మొదటిప్రతితో గలిపి మూలముఁ గనుగొని 30 విగడియలు తీవచఁగా నతమగును॥ నతము ౧3-30 కంటె నధికముగా నుండునపుడు 30 విగడియలు నతముతోఁ గలిపి వర్గచేసి ౨ చే భాగింప సమాఖ్య యగును. పిమ్మట నతములో ౧3 - 30 తీవిచి ౪ చేఁ బెంచి సమాఖ్య లో తీవిచి మధ్యాహారములో తీవిచి అతఃకర్ణముచే భాగింప అభిమతహార మగును. భాజ్యమును అభిమత హారముచే విభజింప ఇష్టకర్ణమగును. దీనియొక్కయు ౧౨ యొక్కయు వర్గల అంతరమునకు మూలముచేయ ఇష్టచ్ఛాయయగును॥ 10.

ఉదాహరణము॥ నతవిషయే॥ ౧౨ యొక్కవర్గ ౧౪౪ ఇష్టచ్ఛాయ ౬-3౬ దీనివర్గ ౪3-33 గలుప ౧౮౭ - 33 దీనిమూలము ౧3 - ౪౨ ఇది ఇష్టకర్ణము- భాజ్యము ౧౧౪ - ౧౯ దీనిని ఇష్టకర్ణముచే విభజింప ౮ - ౨౦ అభీష్టహారము- దీనిచేత అతఃకర్ణమగు ౧౨ - 33 ను గుణింప ౧౦౪ - 3౫ మధ్యా హారమగు ౧౧౧-౧౨ లో తీవచ ౬ - 3౭ దీనిని రెట్టించ ౧3 - ౧౪ దీనిమూలము 3-3౬ ఇందులో 30 విగడియలు తీవచ 3 - ౬ నతకాలము॥ (1) మధ్యాహారములో తీవిచి రెట్టించిన పిమ్మట ౧౯౪ కంటె నధికమయినప్పుడు ౧౯౭ - ౯ కల్పితము॥

దీనిలో ౧౯౪ తీవచ 3-౯ దీనిని 3 చే విభజింప ౧-3 దీనినిగలుప ౧౯౯-౧౨ దీనిమూలము ౧౪-౪ దీనిలోనుండి 30 విగడియలు తీవచ ౧3-3౪ నతము

(౨)...నతము ౧3-30 కంటె నధికమయినప్పుడు చేయవలసిన ఇష్టచ్ఛాయవిధి॥ నతము ౧౫-౧౦ దీనిలో 30 విగడియలు కలుప ౧౫-౪౦ దీనివర్గ ౨౪౫-౨౬ ÷ ౨=౧౨౨-౪3 సమాఖ్య - నతం ౧౫-౧౦ లో ౧3-30 తీవచ ౧-౪౦ × ౪=౬-౪౦ ఇది సమాఖ్యలోనుండి తీవచఁగా ౧౧౬-3 ఇది స్ఫుటసమాఖ్య - హారమగు ౧3౨-3౬ లో తీవచ ౧౬-33 దీనిని అక్షకర్ణమగు ౧3-౧౯ చే భాగింప ౧-౧౪ అభిమతహారము - దీనిచే భాజ్యమగు ౧౨౦-౧౪ ను భాగింప ౯౭-౨౯ ఇది ఇష్టకర్ణము - దీనివర్గ ౯౭౦3 ను ౧౨ యొక్క వర్గ ౧౪౪ ను వీని అంతరము ౯౫౫౯ దీని మూలము ౯౭-30 ఇది ఇష్టచ్ఛాయ దీనినిబట్టిచేయఁగా ౧౫-౧౦ నతము వచ్చును॥ 10.

అథ క్రాంతిసాధనమాహ.

శ్లో॥ చత్వారింశ దశీతి రద్రికు భువః క్ష్వేక్షేందవో భూధృతీ !
షట్ ఖాక్షీణి జినాశ్వి నోఽంగవికృతీ । ఖాబ్ధ్యశ్వినః సాయనాత్ ।
ఖేటాద్దోర్లవదిగ్లవభ్రమగతోఽంకోఽసౌ తదూనాగతా చ్ఛేషఘ్నా
ద్దశలబ్ధియు గ్దశహృతోఽంశా ద్యోఽపమః స్యాత్స్వదిక్। 11.

టీ॥ సాయనాత్ = అయనాంశయుక్తమయినటువంటి, ఖేటాత్ = రవివల్ల దోర్లవదిగ్లవభ్రమగతః = దోః-భుజయొక్క, లవ = భాగలు, దిక్=౧౦ చేత, లవ = భాగింపఁబడినవై, భ్రమగతః = గతించినటువంటి, అంకః = అంకము, స్యాత్ = అగును, అసౌ = ఇది, తదూనాగతాత్ = తత్ = ఏస్యాంకము నుంచి, ఊనాగతాత్=గతాంకము తీవచుటవల్లవచ్చిన, శేషఘ్నాత్=అంకశేషము గుణించుటవల్లనుంచి, దశలబ్ధియుక్ = దశలబ్ధి = ౧౦ చేత భాగింపబడిన విభక్తమందు, యుక్ = గతాంకము, గలుపబడినదై (తతః=పిమ్మట) దశహృతః = ౧౦ చేత భాగింపఁబడినదై, అంశాద్యః = భాగాది, స్వదిక్ = సాయనరవి దిక్కు-గల, అపమః = క్రాంతి, స్యాత్ = అగును, అథ = అటుపిమ్మట, చత్వారిం



తత్= ౨౪ అశీతిః= ౮౦ అద్రికుభువః= ౧౧౭ క్ష్వేక్షేందవః= ౧౫౧ భూధృతీ= ౧౮౧ షట్ ఖాక్షీణి= ౨౦౬ జినాశ్వినః= ౨౨౪ అంగవికృతీ= ౨౩౬ ఖాబ్ధ్యశ్వినః ౨౪౦ (ఏతే= ఇవి) నవ= తొమ్మిదియు- అంశాః=అంశములు, స్యుః= అగును. 11. ఉపపత్తిః॥ గ్రహా యైర్భాగై ర్విషువద్వృత్తాద్దక్షిణోత్తరగమనం కరోతి- తే క్రాంత్యంశాః - క్రమణం క్రాంతిః - తస్య అంశా ఇత్యన్వర్థం నామ విషువద్వృత్తం యద్వర్తతే- త న్నిరక్షే సమం పూర్వాపర మిత్యర్థః మేషతులాదిస్థాగ్రహాస్తస్మిన్ వృత్తేతిష్ఠన్ భ్రమతి-మేషాదయః షట్ తస్యోత్తరార్ధే తులాదికా దక్షిణా ఏవ నతు మేషాదివద్రాశయః-ఉత్తరత శ్చైకత్రావతిష్ఠంతో భ్రమంతీతి-కింతు మేషాదిరాశిత్రయం యావత్ ప్రతిక్షణ ముత్తరతః-క్రమేణ చతుర్వింశత్యంశాన్, యావ దహోరాత్రవృత్తే పరిభ్రమన్ గచ్ఛతి - తతః పరావర్త్య రాశి త్రయం కన్యాంతంయావత్తేనైవమార్గేణ పున స్తదేవ విషువద్వృత్తమాశ్రయాని -ఏవం తులాదేర్దక్షిణత ఏవ రాశిత్రయంగత్వా పునస్తేనైవ యథాపరావర్త్య తదేవ విషువద్వృత్తం మేషాదిస్థ ఏవాశ్రయతి-ఏవం భగోళే తద్దిక్ స్థక్రాంతి రితి పరిభాషా- ఏవం సూర్యస్య-అన్యేషాం గ్రహనక్షత్రాణాం స్వస్వవిమండలానుగతత్వాత్ -గోళార్ధయో ర్వైపరీత్య సంభవః - స్యాదితి-తద్యథా విషువద్వృత్తా త్క్రాంతివృత్తం తిరశ్చీనం వర్తతే, తయో ర్మేషతులాద్యౌసంపాతద్వయం = తత్రక్రాంత్యభావః- మకరకర్కటాద్యౌ పరమం దక్షిణోత్తరం చతుర్వింశత్యంశాంతరం తత్ర క్రాంతేః పరమత్వం ఏవం తిరశ్చీనాత్ క్రాంతిమండలాదపి గ్రహమండలం తిరశ్చీనం వర్తతే-తయోః స్వక్షేపపాతే సమఽర్ధే చ సంపాతౌ - తస్మాత్త్రిభేఽంతరే పరమం విక్షేపాం శతుల్యం దక్షిణోత్తర మంతరం విక్షేపః-ఏవం పృథక్ గ్రహనక్షత్రాణాం విమండలాని తిరశ్చీనాని వర్తంతే-తత్ క్షేపవశాత్ గోళాన్యత్వసంభవః స్యాదిత్యుపపన్నం- తదుక్తం సిద్ధాంతశిరోమణౌ ॥ నాడికామండలా త్తిర్య గేవాపమః క్రాంతివృత్తా వధిః క్రాంతివృత్తా చ్చరః - క్షేపవృత్తావధి స్తిర్యగేవం స్ఫుటో నాడికావృత్త ఖేటాంతరా లోపమః॥ అతః శరసంస్కృతా స్పష్టాక్రాంతిః స్యా దిత్యగ్రే ఆచార్యోక్తాత్యుక్త మస్తి - అత్ర గుణకభాజకోపపత్తి ర్యథా, యది త్రిజ్యాతుల్యభుజజ్య

యా పరమక్రాంతిజ్యా తదేష్టదోర్జ్యయా కిమితి-ఫలం క్రాంతిజ్యాతద్ధనుః క్రాంతిః స్యాత్- అత్రాచార్యేణ లాఘవార్థం దళభుజగానాం అనేనైవ విధినా క్రాంత్యంకాః సాధితాః- తే సావయవా జాతాః- అతో దళగుణాః- కృత్వాపఠితాః-తతోంతరేఽనుపాతః- యదిదళభిర్భాగై రేకో లభ్యతే - తదేష్టాంశైఃకిమితి - ఫలమితోగతాంకః స్యాత్ - శేషా దప్యనుపాతః - యది దళభిర్భాగైర్గతైష్యాంతరం లభ్యతే తదా శేషాంశైః కి మితి - ఫలం గతాంకే యుక్తం కార్యం సా క్రాంతిః స్యాత్-పరం దళగుణా స్తతో దళభక్తే త్యుపపన్నం॥ 11.

తా॥ సాయనరవి భుజభాగలను ౧౦ చే విభజింప విభక్తము గతాంక మగును-శేషభాగాదులను ఏష్యగతాంకముల యంతరముచే హెంచి ౧౦ చే భాగించి గతాంక సంఖ్య గలిపి ౧౦ చే భాగింప భాగాది సాయనరవి గోళముగల క్రాంతి యగును॥ 11.

కాంతియంకముల చక్రము.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఖండములసంఖ్య. | ౦ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ |
| ఖండములు. | ౦ | ౪౦ | ౮౦ | ౧౧౭ | ౧౫౧ | ౧౮౧ | ౨౦౬ | ౨౨౪ | ౨౩౬ | ౨౪౦ |
| అంతరములు. | ౪౦ | ౪౦ | ౩౭ | ౩౪ | ౩౦ | ౨౫ | ౧౮ | ౧౨ | ౪ | ౦ |

ఉదాహరణము॥ సాయనరవి ౧౧-౨౬-౫౪-౨౦ భుజ-౦-౩-౫-౫౦ ÷ ౧౦=౦ గాన గతాంకములు లేవు - శేష భాగాదులు ౩-౫-౫౦ × గ్లైష్యాంతరం ౪౦=౧౨౩-౫౩-౨౦÷౧౦ = ౧౨-౨౩-౨౦ గతాంకము లేనందునఁ గలుపలేదు. దీని దళభక్తఫలం ౧-౧౪-౨౦ ఇది దక్షిణా క్రాంతి॥ 11.

అథప్రకారాంతరేణ క్రాంతిసాధనమాహ.

శ్లో॥ స్యుః ఖండాని ఖవార్ధయోంబరకృతాః శైలాగ్నయోబ్ధ్యగ్నయః । త్రింశత్తత్త్వధృతీనవారినిధయ స్తైః సాయనాంశగ్రహాత్ ।
బాహ్వంశాభ్రకుభాగసంఖ్యకయుతిః శేషైష్యఘాతా ద్దశాప్తా
ద్ధ్యా దిగ్విహృతా లవాది రపమ స్తద్దిక్ స్వగోళా భవేత్॥ 12.



టీ॥ ఖవార్ధయః=౪౦, అంబరకృతాః=౪౦, శైలాగ్నయః=౩౭, అబ్ధ్యగ్నయః=౩౪, త్రింశత్=౩౦, తత్త్వ=౨౫, ధృతి=౧౮, ఇన=౧౨, వారినిధయః=౪ (ఏతాని=ఇవి) ఖండాని=ఖండములు, స్యుః=అగును, తైః=ఆఖండములచేత, సాయనాంశగ్రహాత్ = అయనాంశయుక్తగ్రహమువల్లనుంచి, బాహ్వంశాభ్రకుభాగ సంఖ్యకయుతిశ్చభాహ్వంశ = భుజభాగములయొక్క, అభ్రకుభాగ = పదియవభాగమందు, సంఖ్యకయుతిశ్చ=గతఖండసంఖ్యలు కలుపఁబడినదియు, శేషైష్యఘాతాత్-శేష=అభ్రకుభాగశేషాదులు, ఏష్య=మిగిలినఖండముచేత, ఘాతాత్=గుణింపగా వచ్చినదానినుంచి, దశాప్తాద్ధ్యా, దశ=౧౦ చేత, ఆప్త=భాగింపఁబడి, ఆఢ్యా=గతఖండయోగము కలుపఁబడినదై, దిగ్విహృతా=౧౦ చేత భాగింపబడినట్టువంటిదై, స్వగోళాత్=గ్రహముండెడు గోళమునుంచి, తద్దిక్=ఆదిక్కుగల, లవాదిః=భాగాది అపమః=క్రాంతి, స్యాత్=అగును॥ 12.

తా॥ సాయనరవియొక్క భుజభాగలనుమాత్రము ౧౦ చే భాగింపగా విభక్తము గతఖండములగును, మిగిలినభాగాదిని ఏష్యఖండముచేఁ హెంచి ౧౦ చే విభజింపగా వచ్చిన విభక్తమగు ప్రథమరాశిలో గతఖండములమొత్తమును గలిపి ౧౦ పాలుగొనఁగా వచ్చినది భాగాదిగా గ్రహముండుగోళముయొక్క దిక్కుగల క్రాంతియగును॥ 12,..........క్రాంతియంకములు, ౧ మొదలు ౪౦-౪౦-౩౭-౩౪-౩౦-౨౫-౧౮-౧౨-౪ ఇవే =ఖండములు॥

ఉదాహరణము॥ సాయనరవి, ౧౧-౨౬-౫౪-౧౦ భుజభాగలు, ౩-౫-౫౦ ఇందలి భాగలనుమాత్రము ౧౦చే విభజింప విభక్తము ౦- కావున గతఖండములులేవు. ఏష్యఖండము మొదటిది గాన శేష భాగాదులు ౩-౫-౫౦ × ౪౦ ÷ ౧౦=౧౨-౨౩-౨౦ గతఖండయోగములేదు దీని ౧౦ వ భాగము ౧-౧౪-౨౦ సాయనరవి దక్షిణగోళమగుటచే దక్షిణాక్రాంతి ౧-౧౪-౨౦॥ (12.)

అథప్రకారాంతరేణ స్థూలక్రాంతిసాధన మాహ.

శ్లో॥ షట్షడిషూదధిదృక్కుభి రర్ధైః ఖేటభుజాంశదినాంశమితైక్యం । శేషహతైష్యదినాంశయుతం వాంశాద్యపమః సుఖసంవ్యవహృత్యై ॥ 13

టీ॥ వా = ఈవఱకుఁజెప్పినవిగాక, షట్షడిషూదధిదృక్కుభిః షట్ = ౬ షట్ = ౬ ఇషు=౫ ఉదధి=౪ దృక్ =౨ కుభిః=౧ అర్థైః = ఖండములచేత ఖేటభుజాంశదినాంశమిత్యైక్యం- ఖేట = గ్రహముయొక్క, భుజాంశ = భుజభాగలుగ, దినాంశమిత ౧౫ వ భాగము ( గతఖండములగును ) ఐక్యం = గతఖండములతోఁ కలుపబడినదై, శేషహృతైష్యదినాంశయుతం=ఏష్యఖండముచేత గుణింపఁబడినశేషము ౧౫ చే భాగింపఁబడి గతఖండముల మొత్తముతోఁ గలుపఁబడి అంశాద్యపమః = భాగాదిక్రాంతి సుఖసంవ్యవహృత్యై = సులభగణితమునకొఱకు, స్యాత్ = అగును॥ 13

ఉపపత్తిః॥ అత్ర తు పంచదశభాగానాం క్రాంతియోగాభాగాధికాః సాధితాఃతత్రానుపాతః యది పంచదశభాగైరేకం ఖండం తదా భుజభాగైఃకిమితిలబ్ధం గత ఖండానాం యోగమితా క్రాంతిః అత్ర తు పంచదశభాగానాం క్రాంతిభోగ్య ఖండం లభ్యతే తదాశేషాంశైః కి మితి ఫలం గతఖండయోగేయోగాత్ క్రాంతిః స్యాత్ పరం సా స్థూలా ఖండభాగోనాధికకలాపరిత్యాగా దిత్యుపపన్నం॥ 18

తా॥ సాయనరవిభుజభాగలను ౧౫ చే భాగింప విభక్తము గతఖండములగును శేషభాగాదిని ఏష్యఖండముచేఁ హెంచి ౧౫ చే విభజించి వచ్చిన భాగాదియందు గతఖండములను గలుప భాగాదిక్రాంతియగును. ఇది మిగుల సుకరము. ఖండములు. ౬-౬-౬-౪-౨-౧

ఉదాహరణము॥ సాయనరవిభుజభాగలు ౩-౫-౫౦ ÷ ౧౫=గతాంశములు శేషం. శేషభాగాది- ౩-౫-౫౦ ని ఏష్యఖండమగు ౬ చే గుణింప ౧౮-౩౫-౦ ÷ ౧౫=౧-౧౪-౨౦ క్రాంతి గతఖండములులేనందునఁ గలుపలేదు॥ 13.

అథస్థూలక్రాంతినా భుజాంశసాధన మాహ.

శ్లో॥ తతో దళాని శోధయే త్తిథిఘ్న శేష మేష్యహృత్ । తిథిఘ్నశుద్ధసంఖ్యయా యుతం భవంతి దోర్లవాః॥ 14.

టీ॥ తతః=పిమ్మట, దళాని=ఖండములను, శోధయేత్=తీసివదలెను, తిథిఘ్నశేషం=౧౫ చే గుణింపఁబడినశేషము, ఏష్యహృత్ = ఏష్యఖండముచే భాగింపబడినదై (తతః=పిదప) తిథిఘ్నశుద్ధసంఖ్యయా=౧౫ చే గుణింపఁబడిన శుద్ధఖండసంఖ్యచేత, యుతం=ఏష్యఖండహృతవిభక్తము గలుపబడి, దోర్లవాః=భుజభాగలు, భవంతి=అగుచున్నవి॥ 14.

తా॥ క్రాంతిభాగాదిలో లఘుఖండము లెన్ని పోవునో యన్నియు తీసివేసి శేషమును ౧౫ చేఁ హెంచి ఏష్యఖండముచే భాగించి శోధితఖండసంఖ్యలను ౧౫ చేఁ హెంచి ఏష్యఖండహృతవిభక్తమును గలుప భుజాంశలగును॥ ఇది విలోమగణితము॥ 14

ఉదాహరణము॥ క్రాంతిభాగలు-౧-౧౪-౨౦ × ౧౫= ౧౮-౩౫ = ౦ ÷ ఏష్యఖండము ౬=౩-౫-౫౦ శోధితసంఖ్యలు లేనందున ఇవే భుజభాగలు॥ 14.

అథ దినార్ధాత్ స్థూలక్రాంతిసాధన మాహ.

శ్లో॥ ద్యుదళతిథివియోగ స్తద్వినాడ్య శ్చరం స్యా దథనిజగజభాగోపేత మక్షప్రభాప్తమ్ । దినకృదపమభాగా స్తత్వలిప్తాయుతాః స్యు ర్ద్యుదళకృశపృథుత్వే తే క్రమా ద్యామ్యసౌమ్యాః॥ 15.

టీ॥ ద్యుదళతిథివియోగః=అహర్దళము ౧౫ చే తీసివేఁబడినదై, వినాడ్యః=విగడియలు, చరం=చరవిలిప్తలు, స్యాత్=అగును, అథ=అటుపిమ్మట, తత్=ఆ చరముయొక్క, నిజగజభాగోపేతం-నిజ = స్వకీయమైన, గజభాగ = ౮-వ వంతు, ఉపేతం=కలుపఁబడి, అక్షప్రభాప్తం=విషువచ్ఛాయచేత భాగింపఁబడి, (తే=అవి) దినకృదపమభాగాః=సూర్యునియొక్క క్రాంతిభాగలు, స్యుః=అగును, తే=అవి, తత్వలిప్తాయుతాః=౨౫ లిప్తలు కలుపఁబడి, ద్యుదళకృశపృథుత్వే- ద్యుదళ=అహర్దళము (౧౫ కంటె) కృశపృథుత్వే=అల్పాధికములు కలుగుచుండఁగా, క్రమాత్=వరుసగా, యామ్యసౌమ్యాః=దక్షిణోత్తరక్రాంతులు, స్యుః=అగును॥ 15.

ఉపపత్తిః॥ దినార్ధపంచదశానంతరం పలీకృతం చరఫలాని స్యుః - ఏవం చరఫలాని పంచభక్తాని - చరజ్యేతి యుక్తిః పూర్వం ప్రతిపాదితాస్తి - తత త్రిజ్యావృత్తే ఇయం చరజ్యా తదా ద్యుజ్యావృత్తే కా - లబ్ధం కుజ్యా - అత్ర ద్యుజ్యా

స్థూలత్వాత్-సార్ధద్వాదశాధికశతమితా ధృతా-ఏవం పలభా భుజే ద్వాదశకోటిః తదాఽక్షజ్యా భుజే కా కోటి రితి-జాతా క్రాంతిజ్యా తద్ధనుఃకరణార్థం ద్వౌ హారా-స్థూలత్వా దంగీకృతౌ-ఏవం చరఫలానాంజాతో గుణఘాతో గుణః - ౧౩౫౦ - హారఘాతో హారః-౧౨౦౦-పలభాహారస్తు వర్తతఏవ గుణహారా ఖతిథిభి-౧౫౦ రపవర్తితౌ గుణస్థానేజాతౌ-౯-హారస్థానేఽష్టౌ-౮-యా రాశి ర్నవభిర్గుణ్యతే-అష్టభి ర్భాజ్యతే సః స్వాష్టాంశయుక్త ఏవం భవతి - అత ఉక్తం॥ "చరం నిజ గజభాగోపేత మక్షప్రభాప్తమితి" సాస్థూలాక్రాంతిరతః పంచవింశతికలాయుక్తా సతీ సూక్ష్మాసన్నా దృష్టా - దక్షిణోత్తరోపపత్తిర్యథా - దినదళం దక్షిణగోళే పంచదశఘటికాభ్యో న్యూన మస్తి-అతః కృశే యామ్యాః - ఉత్తరగోళే దినదళం పంచదశాధికం-అతః పృథుత్వే సౌమ్యా ఇత్యుపపన్నం॥ 15.

తా॥ అహర్దళముయొక్కయు ౧౫ యొక్కయు అంతరము చరమగును-దాని ౮-వభాగము భాగాదిచేసి కలుపవలెను- దానిని విషువచ్ఛాయచే భాగించి లిప్తల యందు ౨౫ కలుపఁగా క్రాంతిభాగ లగును- అహర్దళము ౧౫ కంటె తక్కువగా నున్నప్పుడు దక్షిణాక్రాంతియనియు ఎక్కువగా నున్నప్పుడు ఉత్తరాక్రాంతి యనియుఁ జెప్పఁబడును॥ 15.

ఉదాహరణము॥ అహర్దళము ౧౪-౫౭ దీనిని ౧౫ లో తీవచ-౦-౩ భాగాది దీని ౮-వ వంతు- భాగాది- ౦-౨౨-౩౦-దీనిలో ౩-గలుప-౩-౨౨-౩౦ వీని విలిప్తలు- ౧౨౧౫౦ ని విషువచ్ఛాయ- ౩-౪౩-దీని విలిప్తలు- ౧౩౩౮౦ చే విభజింప- ౦-౫౪-౨౯ దీనిలో ౨౫ లిప్తలు గలుగ ౧-౧౯-౨౯- దక్షిణా క్రాంతి యగును॥

అథనతాంశోన్నతాంశ, పరాఖ్యసాధనమాహ.

శ్లో॥ క్రాంత్యక్షజసంస్కృతి ర్నతాంశా స్తద్ధీనా నవతిః స్యురున్నతాంశాః। దినమధ్యభవా స్తతోఽపి యే స్యుః క్రాంత్యంశా లఘు ఖండకైః పరాఖ్యః॥ 16.

టీ॥ క్రాంత్యక్షజసంస్కృతిః - క్రాంతి = క్రాంతిభాగలయందు - అక్షజ= అక్షాంశలు - సంస్కృతిః = సంస్కరించబడినవై- నతాంశాః = నతాంశలు, స్యుః=



అగును - తద్ధీనానవతిః- తత్ =అనతాంశలచేత - హీనా=తీవచఁబడిన - నవతిః = ౯౦ భాగలు - దినమధ్యభవాః - దినమధ్య=పగలు రెండుజాములప్పుడు - భవాః = కలిగినట్టువంటి, ఉన్నతాంశాః = ఉన్నతాంశలు, స్యుః = అగును, తతః= పిమ్మట, లఘుఖండకైరపి = లఘుఖండములచేతనే, యే=యేవి, క్రాంత్యంశాః = క్రాంతి భాగలు, స్యుః = అగుచున్నవో, తే= అవి, పరాఖ్యః = పరాఖ్యమను పేరుగలవి, స్యుః = అగును॥

ఉపపత్తిః॥ విషువద్వృత్తా ద్దక్షిణోత్తరతః పరతఃపరమక్రాంత్యంశైః క్రాంతివృత్తం భవతి - తహా క్రాంతివృత్తే భ్రమతి సతి ద్యురాత్రివృత్తం దక్షిణోత్తరవృత్తేదినార్ధే యత్రి లగ్నం తస్మాత్ ప్రదేశాత్ ఖస్వస్తికపర్యంతం నతాంశాః - ఖస్వస్తికాత్తై ర్భాగై ర్దినార్ధే సూర్యో వర్తత ఏవేత్యర్థః - దక్షిణోత్తర వృత్తక్షితిజసంయోగా ద్దినార్ధేయై ర్భాగై రున్నత స్తే ఉన్నతాంశాః - స్వద్యురాత్రివృత్తవిషువన్మండల మధ్యే క్రాంత్యంశాః ఖస్వస్తికాత్ ద్యురాత్రివృత్తపర్యంతం నతాంశాః - దక్షిణ గోళే క్రాంత్యక్షాంశయోగే కృతే సతి ఖస్వస్తికా ద్ద్యురాత్రివృత్తపర్యంతం దక్షిణ నతాంశాః - ఉత్తరగోళే క్రాంత్యక్షజయోరంతరే కృతే సతి ఉత్తరా దక్షిణా వా నతాంశాః - యదోత్తరక్రాంతిరక్షాంశేభ్యో న్యూనా తదాక్షాంశేభ్యః క్రాంతౌ శోధితాయాం దక్షిణతో ద్యురాత్రివృత్తం నతం స్యాత్ - తదా దక్షిణా నతాంశా యదాధికా స్తదా క్రాంత్యంశేభ్యో-అక్షాంశేషు శోధితేషు ఖస్వస్తికాదుత్తరతో ద్యురాత్రివృత్తం నతం స్యాత్తదోత్తరా నతాంశాః స్యుః-అత ఉక్తం క్రాంత్యక్షజ సంస్కృతి రితి - అతోన్నతాంశజీవాయాః ఉపయోగోఽస్తి-ఇష్టకర్ణసాధనార్థం-అతోఽత్రాచార్యేణ త్రిజ్యా చతుర్వింశతిమితా ధృతా - తతఃపంచదశభాగానాం ఖండా న్యుత్పాదితానితానితు క్రాంతే ర్లఘుఖండా న్యేవ-అత ఉన్నతాంశానాం క్రాంతిః కార్యే త్యుక్తం - తస్యాః పరసంజ్ఞా కృతా॥ 16.

తా॥ క్రాంతిభాగలయందు అక్షాంశలను సంస్కరింప నతాంశ లగును, అనఁగా దక్షిణాక్రాంతి దక్షిణనతము అయినయెడలఁ గలుపవలెను - దిశ భేదమయిన యెడల తీవచవలెను -ఆ నతాంశలను (౯౦) భాగలలో తీవచఁగా మధ్యాహ్న ఉన్నతాంశ లగును - వానిని లఘుఖండములచేత క్రాంతినిచేయఁగా అదే పరాఖ్య యగును॥ 16.

తష్టా=భాగింపబడిన, మాసాః=మాసములు, స్వార్థాన్వితాః, స్వ=తనయొక్క, అర్థాంశాః=సగభాగము, అన్వితాః=కలుపబడినదగుచు, దశగుణాః=౧౦ చే బెంచ బడిన, మాసౌఘతః=మాసగణమునుంచి, భగుణాప్తియుక్తమ్, భగుణా=౩౨౮చేత, ఆప్తి=పొందబడినదానిని, యుక్తమ్=కలుపబడి, వారాద్యం=వారాది, స్యాత్ = అగును॥ ౫.

తా॥ మాసగణమును ౧౪ చే భాగింపగా వచ్చినది రాసులగును. మిగిలిన శేషమును ౮ చే విభజింప రాశ్యాదివచ్చును. ఇది మనుతష్టశేషములో తివచవలెను. పిమ్మట మాసగణమును ౧౦ చే భాగింపగావచ్చిన భాగాదిని పైన తివచగావచ్చిన దానిలో కలుపబడి వృత్తధ్రువకము చక్రనిఘ్నముచేసి కలుపబడి క్షేపకము గలిపిన వృత్తమగును.

| | |
|---|---|
| ఉదాహరణము॥<br>౨-౦-౦-౦<br>౦-౭-౩౪-౧౮<br>౧-౨౧-౨౫-౪౩ | మాసగణం ౧౬÷౧౪=౧ రాశి శేషం ౨÷౮=౦।౭।౩౪। ౧౮<br>౧౬÷౧౦=౧-౩౬-౦+౧-౨౧-౨౫-౪౩=తో కలుపగా<br>౧-౨౩-౧-౪౩ మాసగణోత్పన్నవృత్తం ౯-౧-౬-౦ పూర్వ<br>ధ్రువం-చక్రం×౩౮ = ౩౩౪-౧౦-౪౨-౦÷౧౨=౨౮- |

౧౦-౧౦'౪౨-౧ + ౧-౨౩-౧-౪౩ వృత్తం=౦-౩-౪౩-౪౩ + ౦-౧౪-౫౧-౦ క్షేపకం=౦-౧౭-౩౪-౪౩ ధ్రువక్షేపక సంస్కారవృత్తం॥

వారాదికి- తా॥ మాసగణమును ౧౪ చే భాగింపగా మిగిలినశేషమునందు అందులోనిసగము గలిపి మాసగణమును ౧౦ చే బెంచి ౩౨౮ చే విభజింపగా వచ్చిన దానినికలుప వారాదియగును॥ ఉదాహరణము.

మాసగణము ౧౬÷౧౪=౧ శేషము ౨ యిందులోసగము ౧ కలుప ౩-౦-౦ భాగాది॥

మాసగణం ౧౬×౧౦=౧౬౦ ÷ ౩౨౮= ౦-౨౯-౨౧- + ౩= ౩-౨౯-౨౧ మాసగణోత్పన్న వారాది

చక్రనిఘ్నధ్రువం ౫-౯-౩౦-౦ × ౩౮=౧౯౦-౫౫-౧౨-౦ + ౮=౨౮-౧-౫౫-౧౨-౦.



౩।౨౯।౨౧+౧।౫౫।౧౨=౫।౨౪।౩౩ + ౨।౪౭।౪౫ క్షేపకము=౧।౧౩।౧౭ వారాది॥ ౫॥

ఉపపత్తిః॥ వృత్తగుణో రాశ్యాదిః। ౦।౨౫।౪౭।౫౨ అత్ర చతుర్దశభిర్మాసైరేకం చక్రం భవతి అతో భగణ ప్రయోజనాభావాత్ మనుతష్ట మాసా ఇత్యుక్తం - అత్ర సైకో రాశి ధ్రువః ఏకశుద్ధధ్రువః-౦-౪-౧౧-౭ అస్యాపి ఖండ ద్వయం కృత్వా - అత్రేదం ఖండం అధికం గృహీతం -౦-౪-౧౮-౭ సప్తభిః సవర్ణిపం జాతం రూపం ౧ రాశిస్థానే అతో హి స్వార్ధ్యంశ కేనరహితా ఇతి - అధికం ఖండం-౦-౬ దశభిః సవర్ణితం జాతం భాగస్థానేరూపం ౧- అతో గణాభ్రిశలవాఢ్య మిత్యుపపన్నమ్ - అత్రతిథివారాదిక స్యాయం మాసగుణాః ౧-౩౧-౫౦- అత్ర ఖండ ద్వయం -౧-౩౦ ఇదం ద్వాభ్యాం సవర్ణితంజాతం గుణస్థానేత్రయ ౩ యోరాశిత్రి గుణః ద్వాభ్యాంభజ్యతే సః స్వార్ధాన్విత ఏవభవతి-అన్యత్ఖండం -౦-౧-౫౦ ఇదం భగుణైః సవర్ణితం జాతో గుణస్థానే దశ-౧౦- అతో దశగుణాత్ భగణాప్తియుక్త మిత్యుపపన్నమ్॥ ౫.

| చక్రనిఘ్నధ్రువచక్రం ౩౭ లగాయతు ౪౨ వరకు | | | | |
|---|---|---|---|---|
| చక్ర సంఖ్య | రవి | వ్యగు | వృత్తం. | వారాది |
| ౩౭ | ౨-౧-౪౦-౦ | ౮-౧౪-౨౪-౦ | ౧౦-౧౦-౪౨-౦ | ౧-౫౫-౧౨-౦ |
| ౩౮ | ౨-౩-౨౦-౦ | ౩-౧౫-౩౬-౦ | ౭-౧౧-౪౮-౦ | ౭-౪-౪౮-౦ |
| ౩౯ | ౨-౫-౦-౦ | ౧౦-౧౬-౪౮-౦ | ౪-౧౨-౫౪-౦ | ౫-౧౪-౨౪-౦ |
| ౪౦ | ౨-౬-౪౦-౦ | ౫-౧౮-౦-౦ | ౧-౧౪-౦-౦ | ౩-౨౪-౦-౦ |
| ౪౧ | ౨-౮-౨౦-౦ | ౦-౧౭-౧౨-౦ | ౧౦-౧౫-౬-౦ | ౧-౩౩-౩౬-౦ |
| ౪౨ | ౨-౧౦-౦-౦ | ౭-౨౦-౨౪-౦ | ౭-౧౬-౧౨-౦ | ౬-౪౩-౧౨-౦ |

| చక్ర సంఖ్య | చక్రనిఘ్నధ్రువోన క్షేపకం రవి | చక్రనిఘ్నధ్రువయుక్త క్షేపకం వ్యగు | చక్రనిఘ్నధ్రువయుక్త క్షేపకం వృత్తం | చక్రనిఘ్నధ్రువయుక్త క్షేపకం | వారాది |
|---|---|---|---|---|---|
| ౩౭ | ౧౦-౨-౪౧-౦ | ౭-౨౧-౪-౨-౦ | ౧౦-౨౫-౩౩-౦ | ౪-౪౩-౫౭-౦ | ఈ చక్రములవలన ధ్రువక సంస్కారము వేరే చేయనవసరము లేదు, యీ క్షేపకములు కలుపవలెను. |
| ౩౮ | ౧౦-౧-౧-౦ | ౨-౨౨-౫౪-౦ | ౭-౨౬-౩౯-౦ | ౨-౦-౦ | |
| ౩౯ | ౯-౨౯-౨౧-౦ | ౯-౨౪-౬-౦ | ౪-౨౭-౪౫-౦ | ౭-౯-౩౬ | |
| ౪౦ | ౯-౨౭-౪౧-౦ | ౪-౨౫-౬౮-౦ | ౧-౨౮-౫౧-౦ | ౫-౧౯-౧౨ | |
| ౪౧ | ౯-౨౪-౧-౦ | ౧౧-౨౬-౩౦-౦ | ౧౦-౨౯-౫౭-౦ | ౩-౨౮-౪౮ | |
| ౪౨ | ౯-౨౪-౨౧-౦ | ౬-౨౭-౪౨-౦ | ౮-౧-౩-౦ | ౧-౩౮-౨౪ | |



## అథధ్రువకక్షేపక సంస్కారనిర్ణయమాహ

శ్లో॥ మాసగణాజ్జనితో రవిరూనశ్చక్రహత ధ్రువకేణనిజేన। సంకలితా ఇతరేథచ తేస్యుః క్షేపయుతానిజమాసిసితాంతే ॥౬॥

టీ॥ మాసగణాత్=మాసగణముదల్లనుంచి - జనితః=కలిగినటువంటి - రవిః=సూర్యుడు - నిజేన=స్వకీయమైన - చక్రహతధ్రువకేన=చక్రముచే హెంచబడిన ధ్రువకముచేత - ఊనః=తివచబడినవాడుగా - కార్యః=చేయవలెను - ఇతరే=వ్యగువృత్త వారాదులు - తేన=అధ్రువకముచేత - సంకలితాః=కలుపబడినవై - కార్యాః=చేయదగినది - అథచ=పిమ్మట - తే=అవి - క్షేపయుతాస్సంతః = క్షేపకములతో కలుపబడినవగుచు - నిజమాసి=తనకిష్టమగు మాసమందలి - సితాంతే=పూర్ణమాంతమునకు, స్యుః=మధ్యగ్రహములగుచున్నవి ॥౬॥

తా॥ మాసగణముదల్ల రాబడిన రవికి చక్రనిఘ్నధ్రువకము తివిచి క్షేపకము కలుపబడవలెను. తక్కిన వ్యగువృత్తవారాదులకు చక్రనిఘ్నధ్రువకము క్షేపకము కూడా కలుపబడవలెను. తాను కోరిన పూర్ణిమాంతమునకు మధ్యగ్రహము లగును॥ ౬ ॥

ఉపపత్తి॥ చక్రహతాస్తుధ్రువకాః గ్రహేషు ప్రక్షేప్యాః ఏవం వర్షాణామేకాదశకత్వాత్ । తత్రరవేర్ధ్రువకో ద్వాదశకుద్ధో೭స్తి । అతస్తమూనోరవిః కార్యః । అక్ష్యేయో జ్యావేవ । యతఃగ్రంథకర్తదిమారభ్యాగ్రిసరకాలాదేవగ్రహాః సాధితాః । అతః సృష్ట్యాదేః సకాలాత్సాధితాయే గ్రహాస్తద్యుక్తా ఏవేత్యుపపన్నమ్ ॥౬॥

ఉదాహరణము ౫ వ శ్లోకములో వ్రాయబడినది.

## అథపక్షచాలనమాహ

శ్లో॥ రవౌపాతిషికం చాలనంఖేందైవ దేవావిపాతేన భోబాణచంద్రాన్విపాశ్చ। షడర్కాయుగాక్షా గృహాద్యంచవృత్తే। దినాద్యేన భోక్షాబ్ధయో బాణబాణాః ॥౭॥

టీ॥ ఖేంద్రదేవాః। ఖ=౦। ఇంద్ర=౧౪। దేవాః = ౩౩, =౦।౧౪।౩౩। రవౌ = సూర్యునియందును, నభః=౦, బాణచంద్రాః=౧౫, నఖాః=౨౦=౦, ౧౫।౨౦। విపాతే=విపాతయందును, షడర్కాయుగాష్టాః, షట్=౬, అర్కాః=౧౨, యుగాష్టాః=౫౪=౬, ౧౨।౫౪। వృత్తే=వృత్తయందును, నభోఽష్టాబ్ధయః, నభః=౦, అష్టాబ్ధయః=౪౫, బాణబాణాః=౫౫=౦, ౪౫।౫౫ దినాద్యే=వారాది యందును, గ్రహాద్యం = రాశ్యాది, పాక్షికంచాలనం=పక్షచాలనము, భవతి=అగుచున్నది॥ ౭.

తా॥ పక్షచాలనమునకు రవికి రాశ్యాది ।౦।౧౪।౩౩।౦ వ్యగువుకు । ౦।౧౫।౨౦।౦। వృత్తమునకు ౬।౧౨।౫౪।౦ వారాదికి, ౦।౪౫।౫౫।౦ అగును॥ ౭॥

ఉపపత్తిః॥ పూర్వ్వ మనుపాతాత్ రవ్యాదీనాం మాసగణాః సాధితాఃసంతి తేషామర్థచాలనంకృతం అమాంత కాలిక గ్రహసాధనార్థమితి। ఏతదేవద్వాదశఘ్నం షణ్మాసచాలనం చతుర్వింశతిగుణం వర్షచాలనంభవతిసుగమమ్॥ ౭॥

ఉదాహరణము॥ పూర్ణిమాంతమధ్యగ్రహములు

| | | | |
|---|---|---|---|
| రవి ౧।౧౮।౨౧।౧౮ | వ్యగు ౦।౨।౨౬।౦ | వృత్తం ।౦।౧౮।౩౪।౪౩ | వా॥ ౧।౧౩।౧౮। |
| ౦।౧౪।౩౩।౦ | ౦।౧౫।౨౦।౦ | ౬।౧౨।౫౪।౦ | ౦।౪౫।౫౫ |
| ౨।౨।౫౪।౧౮ | ౦।౧౭।౪౬।౦ | ౭।౧।౨౮।౪౩ | ౧।౫౯।౧౩ |

## అథషణ్మాస చాలనమాహ.

శ్లో॥ శరావేదపక్షాభుజంగాగ్నయోఽర్కే వ్యగౌషట్కృతాః కుశ్చ
షాణ్మాసికే స్యాత్। శరావార్ధయస్త్రీషవోభాదివృత్తేదినాద్యే।
తిథేర్ద్వౌభవాభూర్దినాద్యం॥ ౮

టీ॥ శరాః=౫, వేదపక్షాః=౨౪, భుజంగాగ్నయః=౩౮=౫।౨౪।౩౮, అర్కే=రవియందును, షట్=౬, కృతాః=౪, కుః=౧=౬।౪।౧, వ్యగౌ=వ్యగువు



నందును, శరాః=౫, వార్ధయః=౪, త్రిషవః=౫౩=౫।౪।౫౩, వృత్తే=వృత్తమందును, భాది=రాశ్యాది, షాణ్మాసికం=ఆఱుమాసములచాలనము,. స్యాత్=అగును, ద్వౌ=౨, భవాః=౧౧, భూః=౧=౨।౧౧।౧, తిథేః=తిథికి, దినాద్యే = వారాదియందు దినాద్యం=వారాది, స్యాత్=అగును॥ ౮॥

తా॥ ఆఱుమాసములచాలనము రవికి రాశ్యాది ౫।౨౪।౩౮।౦ వ్యగువుకు ౬।౪।౧।౦ వృత్తమునకు ౫।౪।౫౩।౦ దినాదికి ౨।౧౧।౧ అగును ।౮॥ యిచ్చట ౬ మాసములకు చంద్రగ్రహణము లేనందున గ్రహణము అధికమగుటచే ౧౦ పక్షములు, ఆశ్వయుజ బ॥ ౩౦ సోమవారము సూర్యగ్రహణము అప్పటికి చాలనము చేసిన గ్రహముల వివరము॥

జ్యేష్ఠ బ ౩౦ ఆదివార గ్రహములు.

| | |
|---|---|
| రవి ౨-౨-౫౪-౧౮ | వ్యగు ౦-౧౭-౪౬-౦ |
| ౪-౨౫-౩౦-౦ | ౫-౩-౨౦-౦ |
| ౬-౨౮-౨౪-౧౮ | ౫-౨౦-౬-౦ |

| | | |
|---|---|---|
| వృత్తం ౭-౧-౨౮-౪౩ | వారాది ౧-౫౯-౧౩ | |
| ౪-౯-౦-౦ | ౭-౩౯-౧౦ | ఆశ్వయుజ బ ౩౦ కు చాలన |
| ౧౧-౧౦-౨౮-౪౩ | ౨-౩౮-౨౩ | ధ్రువం |

## ఇష్టతిథి సాధనమాహ.

శ్లో॥ అభిమతవిధిసిద్ధ్యై ప్రాక్పరేయాస్తుతిథ్యః । స్వయంగరసలవో
నాశ్చాలనంస్యాద్దినాద్యే। స్వయుగగుణలవోనాః స్యాల్లవాద్యం
దినేశే॥ స్వగుణనవలవోనావిశ్వనిఘ్నాశ్చవృత్తే॥ ౯.

టీ॥ యాః=ఏ, ప్రాక్పరే। ప్రాక్=ముందుగాను, పరే=వెనుకను అయిన, తిథ్యః=తిథులు, స్యుః=అగుచున్నవో, తాః=ఆ తిథులు, అభిమతతిథిసిద్ధ్యై। అభి

మత=ఇష్టమయిన, తిథి=తిథియొక్క, సిద్ధ్యై=సిద్ధికొఱకు, స్వయుగరసలవోనాః । స్వ=ఆతిథులు ప్రతిగానుంచబడి, యుగరస=౬౪ చే భాగింపగా వచ్చిన విభక్తము, ఊనాః=తీవచబడి, దినాద్యే=దినాదియందు, చాలనం=చాలనము, స్యాత్=అగును, స్వయుగగుణలవోనాః । స్వ=ఆతిథులు ప్రతిగానుంచబడి, యుగగుణ=౩౪ చేత, లవ=పొందిన విభక్తము, ఊనాః = తీవచబడి, దినేశే=రవియందు, లవాద్యం=భాగాది, చాలనం=చాలనము, స్యాత్=అగును, స్వగుణనవలవోనాః । స్వ=ఆతిథులు ప్రతిగానుంచబడి, గుణనవ=౯౩ చేత, లవ=పొందబడిన విభక్తము, ఊనాః=తీవచబడి, విశ్వనిఘ్నాః । విశ్వ=౧౩ చేత, నిఘ్నాః=గుణింపబడి, తాః=అవి, వృత్తే=వృత్తమందు, చాలనం=చాలనము, భవతి=అగును॥ ౯.

తా॥ ఏవి పూర్ణిమావాస్యలకు ముందు వెనుక తిథులగుచున్నవో అవి యిష్టమయిన తిథియొక్క సిద్ధికొఱకు। ఆ తిథి ప్రతిగానుంచబడి ౬౪ చే భాగింపగా వచ్చినది తీవచబడి దినాదియందు చాలనము చేయవలెను. తిరిగి మరియొక ప్రతిగా నుంచబడి ౩౪ చే భాగింపగా వచ్చినది ప్రతిలో తీవచబడి రవియందు భాగాదిచాలనము చేయవలెను. తిరిగి మరియొక ప్రతిని ౯౩ చే భాగింపగా వచ్చినది తిథిలో తీవిచి ౧౩ చే హెంచి అది వృత్తమందు చాలనము చేయవలెను॥ ౯.

ఉపపత్తిః॥ అత్రైక చాంద్రదినమానం। ౦-౫౯-౩-౪౫ యద్యేకతిథా చేతత్ తదేష్టతిథిభిః కిమితి। ఇదమిష్ట తిథిగుణంరూపహరస్యావికృతత్వాన్నాశః। అతః ఖండగుణనార్థమస్యైక ఏవగృహీతః ॥ అత ఇదమేకంశుద్ధం కృత్వాజాతం। ౦-౦-౫౬-౧౫ చతుష్షష్ట్యా సవర్ణితమూర్ధ్వస్థానేరూపం। అతః స్వయుగరసలవోనా స్తిథయోవారాద్యే దేయాః। పూర్వేఋణం అగ్రేధనమితి। చాలనేప్యుక్తమస్తి। అథరవిచాలనోపపత్తిః। తత్రరవేః చాంద్రదినాంతర్వర్తినీ మధ్యగతిరియంభాగాద్యా। ౦-౫౮-౧౪ అస్యాఅస్యంశాశుహోనాః। అత ఇదం రూపశుద్ధంజాతం। ౦-౧-౪౬ ఇదంతుర్త్రింశత్ సవర్ణితం జాతమూర్ధ్వంరూపం। ౧॥ అతో యుగగుణలవోనాః। ౩౪। తిథయోరవిచాలనమితి। అథవృత్తచాలనం వృత్తస్య చంద్రమందకేంద్రస్య। ౦। చాంద్రదినాంతర్వర్తినీ మధ్యగతిర్భాగాద్యా। ౧౨-౫౧-౩౭ అస్యాస్త్రయోదశగృహీతాః। అత ఇయంత్రయోదశశుద్ధం। ౦-౮-౨౩ ఇదం



త్రినవతి సవర్ణితంజాతాః। ఊర్ధ్వంత్రయోదశస్యైవ। అతో విశ్వనిఘ్నాః। స్వత్రినవతిభాగోనా స్తిథయోవృత్తచాలనమితి॥ ౯.

అథరవిస్పష్టార్థం తిథేరపిస్పష్టార్థం సూర్యచంద్రయోర్మందఫలే సాధయతి.

శ్లో॥ అత్యష్ట్యష్టివృషార్కగోశరదృశః ఖండానితైర్వృత్తదోర్భాగతీంద్రులవప్రమైక్యమగతఘ్నోచ్ఛిష్ట, విశ్వాంశయుక్, ప్రాగ్వత్స్యా
త్స్వమృణఫలం త్వితిరవేః కేంద్రాద్యదన్యచ్చతద్వ్యాప్తం స్వాం
గలవోనితంకురుతయోః కార్యాపునః సంస్కృతిః ॥ ౧౦.

టీ॥ అత్యష్ట్యష్టివృషార్కగోశరదృశః, అత్యష్టి=౧౭, అష్టి=౧౬, వృష=౧౪, అర్క=౧౨, గో=౯, శర=౫, దృశః=౨, ఖండాని=ఖండములు, స్యుః=అగుచున్నవి, తైః=ఆఖండములచేత, వృత్తదోర్భాగతీంద్రులవప్రమైక్యమ్, వృత్తదోర్భాగ=వృత్తభుజాంశలయందు, తీంద్రు=౧౩ చేత, లవ=భాగింపగావచ్చిన సంఖ్య గతఖండములగును, ప్రమైక్యమ్=గతఖండములుకలిపి, అగతఘ్నోచ్ఛిష్టవిశ్వాంశయుక్, అగత= ఏష్యఖండముచేత, ఘ్న=గుణింపబడిన, ఉచ్ఛిష్ట=శేషము, విశ్వాంశయుక్= ౧౩ వ వంతు కలుపబడవలెను. ప్రాగ్వత్=వెనుక చెప్పినట్లు కేంద్రాది అనగా మేషాదిషట్కమందు ధనమును తులాదిషట్కమందు ఋణమును, ఫలం=ఫలము, స్యాత్=అగును, అన్యచ్చ=ఇతరమైతే, రవేః=సూర్యునకు, యత్ ఫలం=యేఫలమైతేగలదో, తత్=అది, సాధ్యాః=సాధించతగ్గది, తద్వ్యాప్తం, తత్=అది, వ్యాప్తం=౨చే భాగింపబడి, స్వాంగలవోనితం-స్వ=స్వకీయమైనదాని, అంగలవ=౬వ వంతు, ఊనితం=తీవచబడుటు, కురు=చేయుము, పునః=తిరిగి, తయోః=వాట్లయొక్క, సంస్కృతిః=సంస్కారము, కార్యా= చేయితగ్గది॥ ౧౦॥

తా॥ ౧౭।౧౬।౧౪।౧౨।౯।౫।౨। ఇవిఖండములు, వృత్తభుజాంశలను ౧౩ చే భాగింప విభక్తము గతఖండములగును, ఏష్యఖండముచేత ఏష్యభాగాదులను హెంచి ౧౩ వ వంతు భాగలలో గతఖండములుకలిపి లిప్తావిలిప్తలుచేసికొనవలెను. వృత్తకేంద్రము మేషాదిధనమును తులాదిఋణమును చేయవలెను. రవికిమందోచ్చలో తీసి

కేంద్రముతీసికొనివచ్చి భుజాంశలను ౧౩ చే భాగింప విభక్తము గతఖండములగును, మిగిలినభాగాదిని ఏష్యఖండముచేత హెంచి ౧౩ చే భాగింపగావచ్చిన భాగాదిని గతఖండయోగములచేర్చి ౨ చే భాగించి ౬ వ వంతు తీయవలెను. ఇవి మేషాదుల నెరిగి ధనఋణములు చేయవలెను॥ ౧౦॥

ఉపపత్తిః॥ అత్రవృత్తం త్రయోదశభాగాంతరం పరికల్ప్యపూర్వోక్తవన్మంద ఫలంఖండాని చంద్రస్యసాధితాని రాశిత్రయమధ్యే సప్తైవఏతాని మందఫలఖండాని సావయవాన్యతో ద్విపంచదశగుణాని నిఃశేషాణిభవంతి, అతఃపంచదశగుణాని కృత్వా పఠితాని, అత్రేష్టఫలార్థమనుపాతః, యదిత్రయోదశభాగైరేకంఖండం తదేష్ట వృత్తదోర్భాగైః కిమితి, లబ్ధమితఖండానామైక్యం కార్యం, తతఃశేషాదనుపాతః, యదిత్రయోదశభాగైరేష్యఖండంతదా శేషాంశైః కిమితిలబ్ధంగతఖండయోగే యోజ్యం తత్ఫలంస్యాత్, ధనర్ణోపపత్తిః స్పష్టీకరణాధికారేఉక్తైవాస్తి, ఏవంరవికేంద్రాదపిసాధ్యఫలంసాధ్యం, తత్రలాఘవార్థం ఏభిరేవఖండైః రవికేంద్రాదపిఫలంసాధ్యమిత్యుపపన్నమ్, అత్రచంద్రఫలం కేనభక్తం రవిఫలం స్యాదితి జ్ఞానార్థం సూర్యఫలేన పరమేణ, ౨౧౦ చంద్రపరమఫలే ౫।౨ భక్తేలబ్ధం ద్వౌ ౨। అతశ్చంద్రఫలంద్వాభ్యాం, ఏవంద్విభక్తం। చంద్రఫలం। ౨-౩౧ సూర్యఫలాత్ ౨-౧౦ యదధికం। ౦-౨౧ తద్ద్విభక్తస్య। ౨-౩౧ షడంశాః। స్వల్పాంతరాత్। అతఉక్తం। స్వషడంశవివర్జితమితి। ఏవముభయోఃఫలయోః సంస్కృతిఃకార్యేతిధాదేయత్వాత్॥ ౧౦.

ఉదాహరణము॥ వృత్తము ౦-౧౮-౩౪-౪౩ యిదే కేంద్రము యిదే భుజయగును. భాగలను ౦-౧౮-౩౪-౪౩÷౧౩=౧ గతఖండము। ఏష్యం। ౫-౩౪-౪౩×౧౬ ఏష్యఖండము=౮౯-౧౫-౨౮÷౧౩=౬-౫౧-౫౭

గతఖండము ౧౭

వృత్తఫలం ౨౩-౫౧-౫౭

రవిమందోచ్చ
౨-౧౮-౦-౦
౧-౧౮-౨౧-౧౮
౦-౨౯-౩౮-౪౨÷౧౩=౨ గతఖండములు ఏష్యభాగాది ౩-౩౮-౪౨×౧౪ ఏష్య ఖండము=౫౧-౧-౪౮÷౧౩



= ౩-౫౫-౩౧
గతఖండములు ౧౭+౧౬ = ౩౩-౦-౦
౩౬-౫౫-౩౧÷౨=౧౮-౨౭-౪౫÷౬=౩-౪-౩౭
౩-౪-౩౭
మేషాదికేంద్రేధనం ౧౫-౨౩-౮+౨౩-౫౧-౫౭=
౧-౯-౧౫-౫ ఫలద్వయ సంస్కృతిః.

అథహారసాధనమాహ

శ్లో॥ వృత్తైష్యదళాద్రసాప్తియుక్తారహితాః। కర్కిమృగాదికేచవృత్తే।
సగుణాంశవహ్నయోహారః స్యాదథసూర్యాచ్చర ముక్తపూర్వవత్స్యాత్ ॥ ౧౧.

టీ॥ సగుణాంశఖవహ్నయః। సగుణాంశ=౩ వ వంతు (౨౦) తో కూడిన, ఖవహ్నయః=౩౦=౩౦-౨౦, కర్కిమృగాదికే=కర్కటమకరాదిరైన, వృత్తే=వృత్తమందు, వృత్తైష్యదళాత్=వృత్తభోగ్యఖండమునుంచి, రసాప్తియుక్తా = ఆరవవంతు, వృత్తము కటకాదిరైతేధనమును। రహితాః = మకరాదిరైతే ఋణమును చేసిన, హారః=హారము, స్యాత్=అగును, అథ=పిమ్మట, సూర్యాత్ = సూర్యునినుంచి, ఉక్తపూర్వవత్=వెనుక చెప్పబడిన రీతిని। చరం=చరము, స్యాత్=అగును॥ ౧౧.

వెనుకటి శ్లోకరీతిని గణితములో వచ్చిన వృత్తభోగ్య ఖండముయొక్క ఆరవ వంతు దెచ్చి। ౩౦-౨౦ లో వృత్తము కర్క్యాదిరైన ధనమును మకరాదిరైన ఋణమునుచేయ హారమగును। పిదప రవినిబట్టి చరము సాధించవలెను. ॥౧౧

ఉపపత్తిః॥ ఇయంఫలసంస్కృతిస్తిథౌ కేయాతోఘటీ కరణార్థమనుపాతః, యదిగత్యంతర కలాభిః షష్టిఘటికాస్తదాఏభిః ఫలకలాభిః కతిఘటికాః। ఏవమత్ర ఫలభాగానాం పూర్వకం। కలీకరణార్థం షష్టిగుణః। ఏతత్ఫలం పంచదశగుణిత మస్తి సావయవత్వాత్। అతః పంచదశహారః గుణహారయోర్హ్రాసేనాపవర్త్య తయోర్జాతోగుణః। ౪। ఇదానీంషష్టిర్గుణః। ౬౦। అతోగుణఘాతోజాతోగుణః ।౨౪౦। హారస్తుగత్యంతరకలాః తాస్తుమధ్యమాఏవగృహీతాః। గుణహారయోశ్చతుర్వింశత్యా

అపవర్తితయోః జాతోగుణః । ౧౦ । హారః । ౩౦-౨౦ ఫలసంస్కృతిర్దశహృతేత్యగ్రేఉక్తమస్తి । అయంహారోమధ్యః । అతః స్పష్టత్వం యథాభోగ్యఖండం పరమం ౧౬ ఇదంకేన గుణంపరమంగత ఫలంభవతి । అతోఽదం భోగ్యఖండం వేదైర్గుణ్యం । తతః చతుర్వింశత్యాఅపవర్తితం । గుణహారయోర్గుణేనాపవర్తి తయోర్జాతో హారః షట్ । ఇదంఫలం నగుణాంశక తిన్నమితే హారేసంస్కార్యం । తత్రికర్మాది షట్కేకేంద్రేగతిఫలం ధనం అతోయుక్తాఇతి । మకరాదిషట్కేఋణం అతో రహితాఇతి । ఏవంజాతః స్పష్టోహారః । అతోహిఫలసంస్కృతిర్దశహతాహారోద్ధృతా నాడ్యః స్యురిత్యుపపన్నమ్. ॥౧౧॥

ఉదాహరణము॥ వృత్తభోగ్యఖండము ౧౬ ÷ ౬=౨-౪౦-౦

౩౦-౨౦ లో వృత్తకేంద్రము మకరాది యగుటచేత ఋణము చేయవలెను.
౨-౪౦
౨౭-౪౦ హారము
శేషము ౧౮×౧౦
౪౪౪
౧౪౦౬ ÷ ౬౧=౨౩-౨౬-౦ అయనాంశలు ౧-౧౮-౨౧-౧౮ రవి

౨౩-౨౬-౦ అయనాంశలు
౨-౧౧-౪౩-౧౮
౩౭ ౧౨
౩౦
౬౯ ౩౦) ౧౪౧-౨౬-౨౪
౪ ౪
౭౩ చరం మేషాదిరాత్రిగానధనము

ఆథస్ఫుట తిథిసాధనమాహ

శ్లో॥ నాడ్యః స్యుః ఫలసంస్కృతిర్దశహతాహారోద్ధృతా ఏదోచరం
సాయం లక్షణకంత్వథోవిఘటికాః పశ్చాదృణం ప్రాగ్ధనం। స్వాం
ఘ్ర్యూనాన్తరయోజనాన్యథతిథిః స్పష్టాత్రిభిః సంస్కృతా ।
తత్సంస్కారఘటీ సమాశ్చకలికా దేయావ్యగావోష్ణగా ॥౧౨॥



టీ॥ ఫలసంస్కృతిః=ఫలద్వయసంస్కృతవృత్తము, దశహతా=౧౦ చే గుణింపబడి, తతః=పిమ్మట, హారోద్ధృతాసతీ = హారముచేత విభజింపబడినదగుచూ, నాడ్యః=గడియలు, స్యుః=అగుచున్నవి, అథ=పిమ్మట, చరం=చరమూ, సాయంలక్షణమే=సాయంకాలమునందు, స్యాత్=అగును, అథ=తరువాత, స్వాంఘ్ర్యూనాన్తరయోజనాని, స్వాంఘ్రి=తనదేశాంతరముల యోజనములలోని నాల్గవవంతు, ఊనా=తీవచబడిన యోజనములు, అంతరయోజనాని=అంతరయోజనములు, విఘటికాః=విగడియలు, పశ్చాత్=పడమరదిక్కు అయితే, ఋణం=ఋణమును, ప్రాక్=తూర్పు అయితే, ధనం=ధనమును, స్యాత్=అగును, అథ=పిమ్మట, త్రిభిః=మూడు సంస్కారములచేత, సంస్కృతా=సంస్కరింపబడి, తిథిః=తిథి, స్ఫష్టా=స్ఫుటమైనది, స్యాత్=అగును, తత్సంస్కారఘటీసమాః=ఆ సంస్కారగడియలతో సమమగు, కలికాః=లిప్తలు, వ్యగౌ=వ్యగువందును, ఉష్ణగౌచ=సూర్యునియందును, దేయాః = ఇవ్వదగినది॥ ౧౨

తా॥ ఫలద్వయసంస్కృత వృత్తము ౧౦ చే హెంచబడి హారముచే భాగింపబడినదై గడియాదులగుచున్నవి. పిమ్మట చరమూ ప్రాతస్సాయంకాలములనుబట్టి సంస్కరించవలెను. పిదపదేశాంతరయోజనములలో నాల్గవవంతు తీవిచి మిగిలిన విగడియలను భూరేఖకు పడమరయైతే ఋణమును తూర్పుఅయితే ధనమునుచేయవలెను. యీమూడుసంస్కారములచేత స్ఫుటతిథిగడియలగును. యీ లిప్తలు వ్యగువునందును రవియందును సంస్కరింపవలెను॥ ౧౨॥

ఉపపత్తిః॥ ఫలటీకరణోపపత్తిః పూర్వమేవోక్తా । చరంస్యస్తత్వే హేతుర్యథా, యద్గ్రహేఋణంతత్తిథౌధనం, యద్ధనం తదృణంభోగ్యత్వాత్, అతఃచరం విపరీతం, రేఖాస్వదేశాంతరో పపత్తిఃపూర్వం ప్రతిపాదితాస్తి, తిథిఃరవిచంద్రాంతరాద్భవతి, అతోగత్యంతరాధనుపాతః, యదిభూపరిధియోజనైః, ౪౮౦౦ గత్యంతరకలాఃలభ్యంతే, తదారేఖా స్వదేశాంతరయోజనైఃకిమితి, పునస్స్ఫుటీకరణాయానుపాతః, యదిగత్యంతరకలాభిః షష్టికలాః తదాభిఃకిమితి, గత్యంతరకలాతుల్యయోర్గుణహారయోర్నాశః, పునరస్యఫలస్యఫలీ కరణార్థం షష్టిర్గుణః ౬౦, ఏవంగుణఘాతో గుణః ౩౬౦౦ హారః, ౪౮౦౦ గుణహారౌద్వాదశశతాపవ ౧౨౦౦ ర్తితౌగుణః,

-౩- హారః -౪- అతః స్వాంఘ్ర్యా నాని యోజనాని పలానిస్యురిత్యుపపన్నమ్-
ఏతత్ఫలత్రియ సంస్కృతాతిథిః స్పష్టాభవతీత్యుపపన్నమ్- రవివ్యగూమధ్యమతిథ్యంత
కాలీనాతయోః స్పష్టతిథి కాలీన కరణార్థం ఫలసంస్కారఘటీభి శ్చాలనందేయం -
అతోలాఘవార్థం స్వల్పాంతత్వాత్సంస్కారఘటీ సమాఃకలాః సూర్యేవ్యగా దేయా
స్తాతాత్కాలికా మధ్యమాభవతఇతి॥ ౧౨.

ఉదాహరణము॥ ఫలద్వయ సంస్కృతవృత్తము -౩౯-౧౫-౫×౧౦=౩౯౨-౩౨--౫౦ ÷ ౨౪-౨|౩=౧౪-౧౧- + చరం -౧-౧౩ = ౧౫-౨౪-౩౭ దేశాంతరం =౧౬-౨- వారాదితిథి ౧-౧౩-౧౭-+౧౬-౨= ౧-౧౩- ౧౭=౧-౨౯-౨౦ స్ఫుటతిథి॥ రవి -౧-౧౭-౨౧-౧౭ + ౧౬-౨=౧-౧౭-౩౪-౨౦ వ్యగుః ౦-౨-౨౬-౦ +౧౬-౨=౦-౨-౪౨-౨॥ ౧౨.

అత స్తయోః స్పష్టత్వార్థం పలమగ్రేసాధయతి.

శ్లో॥ ససార్వహ్లవామినజంఫలం యుగఘ్నంలిప్తాస్తాః । కురుచతయోః
స్ఫుటౌచ తౌస్తః । విత్రింశద్వియుతహారః కృశానుభక్తశ్చంద్ర
స్యపరిభవతిబింబ మంగుళాద్యం ॥ ౧౩.

టీ॥ ఇనజంఫలం=వెనుకరీతిని రాబడిన రవిఫలమును, యుగఘ్నం = ౪ చే హెచ్చించబడి, ససార్వహ్లవాం=౨౪ చే భాగింపగా వచ్చిన దానిని కలుప, లిప్తాః=లిప్తాదియగును, తాఃలిప్తాః=ఆలిప్తాదులు, తయోః=అరవివ్యగ్వర్కులయందు, కురు=సంస్కరింప, తౌ=అరవివ్యగువులు, స్ఫుటౌ=స్ఫుటములు, స్తః=అగును, విత్రింశద్వియుతహారః=మూడవవంతు తీవచబడిన రెండు హారమునందు, యుతః=కలుపబడిః కృశానుభక్తః=మూడుచే భాగింపబడి, చంద్రస్య = చంద్రునియొక్క, బింబం=బింబము, అంగులాద్యం=అంగులాది, పరిభవతి=అగుచున్నది॥ ౧౩.

తా॥ ఇదివరకు తీసికొనిరాబడిన రవి ఫలమును ౪ చే గుణించి ౨౪ చే భాగింపగా వచ్చినదానిని కలుప లిప్తాదియగును, ఆ లిప్తాదులు రవివ్యగువులందు సంస్కరింపబడి స్ఫుటములగును, మూడవవంతు తీవచబడిన రెండు అనగా, ౧-౪౦ హారమునందు కలుపబడి మూడుచే విభజింపబడి అంగులాది చంద్రబింబమగును॥ ౧౩.



ఉపపత్తిః॥ అత్రరవిఫలం పంచదశభిర్భాజ్యం పూర్వం పంచదశగుణితత్వాత్। తతఃకలార్థంషష్టిగుణః । గుణహారయోర్వ్యస్తరేణా పవర్తితయోర్గుణః । ౪ । అతో యుగఘ్నమితి । అత్రపరిథమం రవిఫలం పరమేతావత్ । ౨-౫-౩౧ ధృతమ్ । ఏతన్మికంధార్యం । ౨-౧౦-౩౧ అనయోగంతరమిదం । ౦-౫ ఇదంచతుర్వింశత్యా సవర్ణితంజాతంద్వయం ఫలంతుల్యమేవ । అతః ససార్వహ్లవామితి । తాఃఫలకలాః రవివ్యగ్వోర్ద్వయాస్తాస్ఫుటౌభవతః । అథచంద్రబింబస్యోపపత్తిః । అత్ర తేప్పంబానయనంకార్యం ఇత్యత్రహారోపిగతఖండమతో హారాదనుపాతః । యద్యస్మిన్మధ్యమేహారే । ౩౦-౨౦ ఇదంచంద్రబింబం । ౧౦-౪౦ తదేష్టస్య స్పష్టహారేకిమితి । అత్రగుణాద్వారోపి త్రిగుణాసన్నోఽతోఽత్రవిత్ర్యం శాద్వాక్షేప్యా । తతస్త్రిగుణం చంద్రబింబంభవతి । అత ఉక్తంవిత్రింశద్వియుతహారః । కృశానుభక్తశ్చంద్రబింబమితి ॥ ౧౩.

ఉదాహరణము॥ రవిఫలం । ౩-౪-౪౭×౪=౧౨-౧౯-౨౮÷౨౪=౦-౩౦
౪౬+౧౨-౧౭-౨౭=౧౨-౪౯-౧౪.

౦-౧౨-౧౭+౩౦=౦-౧౨-౪౭+౧-౧౭-౩౭-౨౦ రవి=౧-౧౭-౫౦-౭ స్ఫుటరవి.

వ్యగు । ౦-౨-౪౨-౨+౧౨-౪౭ = ౦-౨-౫౪-౫౦ స్ఫుటవ్యగు॥ హారం ౨౭-౪౦÷౩=౯-౧౩ చంద్రబింబము॥ ౧౩.

అథసూర్యబింబభూభాబింబౌసాధయతి॥

శ్లో॥ ఖాబ్ధ్యాప్తార్కగతదళయుతోనాః స్వకేంద్రేకులీరన క్రాద్యేస్యా
ద్వ్యరిలవభవా అంగులాద్యర్కబింబం । హారోపీషుః స్వతిథిలవ
యుక్ స్యాత్కుభావా స్యాంధనర్ణంస్వర్క్షాప్తార్కగతదళమతో
నక్రకర్క్యాది కేంద్రే॥ ౧౪

టీ॥ అర్కగతదళయుతోనాః । అర్కగతదళ = సూర్యునియొక్క గత ఖండములను, యుతోనాః=రవిసంద కేంద్రము కర్క్యాదిధనమును మకరాది ఋణ

ములను, కార్యాః=చేయవలెను, ఖాబ్ధ్యాప్తా=౪౦ చే భాగింపగా వచ్చిన లిప్తాదిని, వ్యరిలవభవా=౧౦-౫౦ లో పైరీతిని ధన ఋణములు చేయవలెను, రవిబింబమగును, హారః=హారము, లిప్తః=౫ చే తీవచబడినదై, స్వతిథిలవయుక్, స్వ=ప్రతి గానుంచి, తిథిలవేన=౧౫ చే విభజింపగావచ్చిన విభక్తముచేత, యుక్=కలుపబడినదై, కుభా=భూభాబింబము, స్యాత్=అగును, అస్యాం=దీనియందు, ఖాగ్నైః=౩౦ చేత భాగింపగావచ్చినది, అర్కాగతదళం=సూర్యుని భోగ్యఖండమును విభజించి, మకరకర్క్యాదికేంద్రే=మకరకర్క్యాది కేంద్రములయందు, ధనర్ణం=ధనఋణములు, కార్యం=చేయతగినది॥ ౧౪.

తా॥ రవిభోగ్యఖండమును ౪౦ చే విభజింపగా వచ్చిన లిప్తాది రవి మధ్యగతి బింబమందు రవి మందకేంద్రము కర్క్యాదిధనమును మకరాది ఋణమును చేయగా అంగుళాది రవిబింబమగును, హారము ౫ చేత తీవచబడినదై ౧౫ వ వంతు కలుపబడి భూభాబింబమగును । భోగ్యఖండమును ౫౦ చే విభజింపగా వచ్చిన లిప్తాది మకర కర్క్యాది కేంద్రముల నెరిగి ధన ఋణములు చేయవలెను॥ ౧౪.

ఉపపత్తిః॥ మధ్యగతి ప్రమాణేన రవేర్మధ్యాబింబమిదం ౧౦-౫౦ యది మధ్యగత్యా ఇదంతదాస్పష్టగత్యాకిం । అత్రభోగ్యఖండ పరమత్వే గతిఫల పరమత్వమిత్యత్ర । భోగ్యఖండాత్ గతిఫలం ప్రసాధ్య బింబంసాధ్యం । తదత్రపరమం బింబం ౧౧-౧౫ అనయోర్మధ్య స్పష్టయోరంతరం । ౦-౨౫ ఇదం పరమభోగ్యఖండస్యాస్య ౧౬ చత్వారింశత్తమోభాగః । అయం మధ్యాబింబేదేయః । కర్క్యాదౌగతిఫలం ధనమతో యుతోయుక్తః । మకరాదౌగతిఫల మృణమతో హీనః । ఏవంరవిబింబంభవతి । అథభూభాబింబోపపత్తిః అత్రచంద్ర మధ్యగతి వశాత్ జాతం । భూభాఖండమేకం । ౨౬ ఇదం మధ్యహారస్య । ౩౦-౨౦ పంచోనితస్య స్వతిథిలవయుక్తస్య సమంభవతి ! అతోహిస్పష్టహారాదేవం సాధ్యమ్ । తదత్ర సూర్యగతిఫలోత్థంబింబం భూచ్ఛాయాయామస్వాందేయమ్ । తత్రసూర్యభోగ్య ఖండస్యపంచదశాంశందేయమితిదృశ్యతే । యతోహిపరమం భోగ్యఖండమిదమ్ । ౧౬ త్రింశం శోనాప్త=౬-౪౦ భక్తం రవిగతిఫలం భవతి । ౨-౧౩ తదపిస ప్తభక్తం భూభాఖండం భవతి । అతోయం హారఘాతోహారః । ౫౦ భోగ్యఖండం పంచా



త్మభక్తం భూభాఖండేదేయః । మకరాదౌ ఋణం । ఫలంగతేః । అతస్తద్భూభా యాంయుజ్యతే । కర్క్యాదౌ ధనంఫలం తద్భూభాయాం న్యూనం భవతి॥ ౧౪.

ఉదాహరణము॥ రవిగతఖండం ౧౬ ÷ ౪౦=౦-౨౪ వ్యరిలవభవా=౧౦-౫౦-౦-౨౪=౧౦-౨౬ రవిబింబం ॥

హారం ౨౬-౪౦

౫

౨౨-౪౦ ÷ ౧౫=౧-౩౦+౨౨-౪౦=౨౪-౧౦। ఖండం ౧౬ ÷ ౫౦=౦-౧౯

౦-౧౯ మకరత్వాద్ధనం

౨౪-౨౯ భూభాబింబం ౧౪.

అథగ్రహణ సంభవమాహ

శ్లో॥ జ్ఞాత్వైవంతిథిపూర్వకం గ్రహణజం శేషంభవేత్పూర్వవత్ ।
షణ్మాసైరుతపక్షవర్జితయుతైః పక్షేఃథవాలోకయేత్ । అర్కేందు
గ్రహణంవ్యగోర్భుజలవైస్తిథ్యల్పకైరుష్ణగోర్యామ్యైర్లవస్వథ
కైర్ద్యురాత్రిగతిథా చాఽహర్నిశామాశ్రితే॥ ౧౫.

టీ॥ ఏవం=పైప్రకారము, తిథిపూర్వకం=తిథినిబట్టి, జ్ఞాత్వా=తెలిసికొని, శేషం=శేషము, గ్రహణజం=గ్రహణమువల్ల కలుగు శరము స్థితి మొదలైనవి, పూర్వవత్=చంద్రగ్రహణాధ్యాయమందు చెప్పినరీతిని, భవేత్=అగును, అర్కేందుగ్రహణం=రవి చంద్రగ్రహణములు, షణ్మాసైః=గ్రహణాది తిరిగి గ్రహణము కలుగుటకు ఆఱుమాసములచేత, స్యుః=కలుగుచున్నవి, అథవా=అటుగానియెడల, పక్షవర్జితయుతైః=ఒకపక్షము తక్కువగాని యెక్కువగాగాని ఆరుమాసములకు, ఆలోకయేత్=గ్రహణమును చూడవచ్చును, గ్రహణముపుట్టుటకు, వ్యగోర్భుజలవైః=వ్యర్కేందుభుజభాగలు, తిథ్యల్పకైః=౧౫ కంటె తక్కువగానుండుటవలన, గ్రహణం=గ్రహణము, స్యాత్=అగును, తు=మరియు, ఉష్ణగోః=సూర్యునియొక్క, గ్రహణే=గ్రహణమందు, వ్యగుభుజభాగైః యామ్యైః=వ్యగుభుజదక్షిణగోళమందైన, వస్వథకైః=౮ భాగలచేత, స్యాత్=గ్రహణముకలుగును, ద్యురాత్రిగతిథా సత్యాం=సూర్యగ్రహణముపగటియందును, చంద్రగ్రహణము రాత్రియందును, భవతి=కలుగు

చున్నది. అథవా=అటుగాకపోతే, అహర్నిశాం=పగలు రాత్రియందుగల, తిథౌ=తిథియందు, అశ్రితే=కొంచెము రాత్రి తక్కువగానుండునపుడును, పగలుతక్కువగానుండునప్పుడును, గ్రస్తోదయ గ్రస్తాస్తమయగ్రహణములు కలుగును॥ ౧౫॥

తా॥ పైన చెప్పినట్లు తిథినిబట్టి తెలిసికొనిన శేషము గ్రహణమగును. శరముస్థితిచంద్ర గ్రహణములో చెప్పినరీతిని చేసికొనవలెను. సూర్యచంద్రగ్రహణములు గ్రహణానంతరము ఆఱుమాసములకు గాని ఒకపక్షము యెచ్చుతక్కువగా గాని కలుగును. గ్రహణముకలుగుటకు వ్యర్కేందు భుజభాగలు ౧౫ కంటె తక్కువగా నుండునపుడు కలుగును సూర్యగ్రహణము దక్షిణగోళమగునపుడు ౮ భాగలకంటె నెక్కువగానున్నయెడల గ్రహణము కలుగదు. సూర్యగ్రహణము పగటియందును చంద్రగ్రహణము రాత్రియందును తిథి గడియలనుబట్టి చేయవలెను. రాత్రిమానము పగటికి కొంచెము తక్కువగానుండు నపుడును దినమానము రాత్రికి కొంచెము తక్కువగానుండునపుడును చంద్రసూర్య గ్రహణములు గ్రస్తోదయ గ్రస్తాస్తమయగ్రహణములగును. గ్రస్తోదయమనగా గ్రహణముతోనుదయించుట. గ్రస్తాస్తమయమనగా గ్రహణముతోనే అస్తమించుట. ఇపుడు వ్యగుభుజాంశలు ౨ గాన సంపూర్ణ చంద్రగ్రహణముకలుగును. దీనికి ఉపపత్తిగణితములు అనవసరము. ౧౫॥

## అథగ్రాసం సాధయతి

శ్లో॥ సత్ర్యంశగుణోనితో హారోయం వేదఘ్నోంకహృతో వ్యగోర్భుజాంశైః । హీనోభవతాడితోఽద్రిహృత్ స్యాచ్ఛన్నం శీతరుచోంగుళాదికంవా॥ ౧౬.

టీ॥ అయంహారః = ఈహారము, సత్ర్యంశగుణః=౩-౨౦ ఊనితః=తీవచబడినదై, వేదఘ్నః=౪చేతగుణింప, అంకహృతః=౯ చే భాగింపబడినదై, వ్యగోః=వ్యగువుయొక్క, భుజాంశైః=భుజభాగలచేత, హీనః=తీవచబడినదై, కార్యః=చేయవలెను, చేద్దీనః న స్యాత్=అట్లుతీవచబడనియెడల, గ్రహణమేవనాస్తి = గ్రహణమేలేదు, తతః=పిమ్మట, సభవతాడితః= సభవ = ౧౧ చేత, తాడితః=గుణిం



పబడినదై, అద్రిహృత్=౭ చే భాగింపబడవలెను, ఫలః=ఫలము, శీతరుచః = చంద్రునికి, అంగులాదికం = అంగుళాదియైన, ఛన్నంవా = గ్రాసము, స్యాత్ = అగును॥ ౧౬.

తా॥ హారము ౩-౨౦ చే తీవచబడినదై ౪ చేత గుణింపబడి ౯ చే భాగింపబడి వ్యగువుయొక్క భుజభాగలచేత తీవచబడినదిగా చేయవలెను- అట్లు తీవచబడని యెడల గ్రహణముకలుగదు. పిమ్మట ౧౧ చే గుణింపబడినదై ౭ చే భాగింపబడి చంద్రునికి అంగుళాది గ్రాసమగును॥ ౧౬.

ఉపపత్తిః॥ శరోనం మానైక్యఖండం గ్రాస ఇతి ముఖ్యయుక్తిః - తదత్ర మధ్యమం మానైక్యఖండమిదమ్ - ౧౪-౫౨ అత ఏవభాగాః - సాధితా - విలోమవిధినాశరవద్వ్యగు భుజభాగాభవఘ్నాః సప్తభక్తాః శరోభవతి - అతోవ్యస్తవిధినామానైక్యఖండంసప్తగుణమేకాదశభక్తంజాతాభాగాః-౧౨-ఏతేమధ్యహారాద్యధా ౯ గచ్ఛంతి తథాకార్యం - అతోమధ్యహారే సత్ర్యంశగుణోనితేసతి - సప్తవింశతిర్యావత్ చతుర్గుణానవభిర్భజ్యతే - తావద్ద్వాదశభాగా ఏభవంతి - అతః సత్ర్యంశగుణోనితచ్చతుర్గుణోనవభక్తోభాగాః స్యుస్తేభ్యోవ్యగుభుజభాగా ఊనాః కార్యాః- శరస్యన్యూనీకర్తవ్యత్వాత్ తతోభాగా భవగుణాః సప్తభక్తాచ్ఛన్నమంగులాద్యం చంద్రస్యభవతీత్యుపపన్నమ్॥ ౧౬.

ఉదాహరణము॥ హారము ౨౭-౪౦-౩-౨౦=౨౪-౨౦ × ౪=౯౭-౨౦ ÷ ౯=౧౦-౪౮-౫౩—౨-౪౨-౨=౮-౬-౫౧ × ౧౧=౮౯-౧౫-౨౧ ÷ ౭=౧౨-౪౬ గ్రాసము॥ ౧౬.

## అథసూర్యగ్రహణే గ్రస్తోదితే గ్రస్తాస్తేనతఘటికాజ్ఞానమాహ.

శ్లో॥ చేన్నిశైష్యకే గతేఽర్కగ్రహస్త థాన్వితమ్ । స్యాద్దివాదళం
నతం ప్రాక్ పరం క్రమాత్తదా॥

టీ॥ చేన్నిశైష్యకే = రాత్రిశేషమయితే, గతేవా= గతించినదగుచుండగా, అర్కగ్రహః = సూర్యగ్రహణము, స్యాత్తదా = కలిగినప్పుడు, అన్వితం = గతగడీ

యలుకలుపబడి, దివాళం=అపార్థ, కిమాత్ = వరుసగా, ప్రాక్పరం=తూర్పపడమరల, నతం=నతము, స్యాత్=అగును.

తా॥ ఉదయ ప్రభృతికలుగు సూర్యగ్రహణమునకు గత గడియలు అపార్థతో కలిపిన తూర్పుపడమరల నతము అగును॥

అథరవిగ్రహణే గ్రాసానయనం స్థూలమహ

శ్లో॥ అమాంతనతనాడికాంఘ్రిరహితాద్యుతాత్ ప్రాక్పరే। గ్రహాది
కరవేర్నతాంశకరసాంశసంస్కారితాః। వ్యగోర్భుజలవాఃస్ఫుటాః
స్యురథసప్తశుద్ధాశ్చ తే। నిజార్ధసహితా రవేః స్థగితమంగులాద్యం
స్ఫుటమ్॥ ౧౭॥

టీ॥ అమాంతనతనాడికాంఘ్రిరహితాత్, అమాంత=దర్శాంతమందలి, నతనాడికా=నతగడియలలో, అంఘ్రి=నాల్గవవంతు రాశ్యాదిపూర్వనతమందు, రహితాత్=తీవమటవల్లనుంచి, గ్రహాదికరవేః=రాశ్యాదియైనరవినుంచి, పరే=పడమరనతమందు, యుతాత్=కలుపుటవల్లనుంచి, నతాంశకాః=నతాంశలు, స్యుః=అగుచున్నవి. తస్య=రవియొక్క, క్రాంతిః=క్రాంతిః, అక్షాంశైః=అక్షాంశలతోడ, సంస్కృతాః=సంస్కరించబడినవై, నతాంశాః=నతాంశలు, భవంతి=అగుచున్నవి, తేషాం=ఆనత భాగలయొక్క, యోరసాంశకః=యే ఆఱవభాగముగలదో దానిచేత, వ్యగోర్భుజలవాః=వ్యగువుయొక్క భుజభాగలు, సంస్కారితాః = సంస్కరించబడినవై, (అనగా ఏకదిశయోగము భిన్నదిశఅంతరము) తే=అవి, స్ఫుటాః=స్పష్టములు, స్యుః=అగుచున్నవి, అథ=పిమ్మట, తే=అవి, సప్తభ్యః=౭ నుంచి, శుద్ధాః=తీవచబడినవై, కార్యాః=చేయదగినది, యదిన శుధ్యంతి తదాగ్రహణమేవనాస్తి, తే=అవి, నిజార్ధసహితాః=తనసగముతో కూడికొనినవై, రవేః=సూర్యునికి, అంగులాదికం=అంగుళాది, స్ఫుటం=స్పష్టమగు, స్థగితం=గ్రాసము, స్యాత్=అగును॥ ౧౭

తా॥ దర్శాంతమందలి నతనాడికలలో నాల్గవవంతు రాశ్యాది పూర్వనతమందు ఋణమున్ను పశ్చిమనతమందు ధనమున్ను చేయుటవలన నతాంశలగుచున్నవి. రవియొక్క క్రాంతి అక్షాంశలు సంస్కరింపబడి నతాంశలగుచున్నవి. ఆనతాంశల



ఆఱవవంతుచేత వ్యగుభుజభాగలు సంస్కరింపబడి ౭ నుంచితీవచబడవలెను. అవి తీవచబడనియెడల గ్రహణమేలేదు. అందులోసగముతో కలిపినరవికి అంగుళాది స్పష్టమగు గ్రాసమగుచున్నది.

ఉపపత్తిః॥ అత్రరవిగ్రహణే లంబననతి సాధనం వినాగ్రహణ సంభవో పిః జ్ఞాయతే - అతఃస్థూలే లంబన నతీసాధ్యతే - నతఘటీనాంచతుర్థాంశో లంబనం తద్దర్శాంతే దేయం - పునస్తత్కాలీన నతాద్యః పంచమాంశః సరవౌపూర్వకపాలే యావత్ న్యూనీక్రియతే - పశ్చిమకపాలేయుక్తః క్రియతే - తత్త్రిభోన లగ్నంభవతి - అత్రచతుర్థాంశ సంస్కృతవ్య తస్య పశ్చమాంశః కేవలచతుర్థాంశతుల్య ఏవ భవతి - అతో నతఘటీనాంచతుర్థాంశః। పూర్వపరేన తేనవా హీనాధికః కార్యః - తత్ త్రిభోనలగ్నం స్యాత్ - తస్యనతాంశాః కార్యాః। తేభ్యోనతిః సాధ్యాసాకరేణ సంస్కార్యా - స స్పష్టశరో మానైక్యఖండాన్నిప్కాసనీ యోగ్రాసః - స్యాదిత్యత్రలాఘవార్థం నతభాగోత్థనతిభాగైర్వ్యగుభుజభాగాయేతేవిహితాః కృతాః తద్యథా। నతభాగానాం చతుర్థాంశః స్థూలాః నతిర్భవతి। నతిస్తుస్పష్టశరఖండం అతో౭స్యాః భాగకరణార్థం సప్తగుణ ఏకాదశహరః। పూర్వంచత్వారోహరః ఏవం జాతోహరఘాతోహరః। ౪౪। గుణహారయోర్గుణే నాపవర్తితేనార్ధఖాహారస్థానే షట్। అతో నతాంశరసాంశసంస్కారితా వ్యగుభుజభాగాః స్యురితి। అత్రరవేర్మానైక్యఖండమిదం। ౧౦। మధ్యంకితస్మాద్భ్యభుజభాగేభ్యః స్యాదితిజ్ఞానార్థం సప్తగుణమేకాదశభక్తం జాతాభాగాః సప్త। ౭। అతఏతేషుభాగేషుసప్తభ్యో న్యూనేష్వేవగ్రహణం। అతః సప్తశుద్ధాః। శరార్ధంస్థూలత్వాత్ నిజార్ధసహితాఇతి, తత్ అంగులాదికం సూర్యగ్రహణే భన్నంభవతీత్యుపపన్నమ్॥ ౧౭। అథసూర్యగ్రహణే కించిత్ స్థూలంగ్రాసానయనమాహ, అమాంతేతి అస్యోదాహరణం సూర్యగ్రహణే ఉక్తం॥ ౧౭॥

అథపర్వేశానయనమాహ,

శ్లో॥ వ్యగుమధ్యపర్యయ గణోపణిగాదిగే వ్యగుగృహేకుయుతః।
స్మృతచక్రసంజ్ఞకయుతో విధితో గతపర్వపోముని హతోర్వ
రితః॥ ౧౮॥

టీ॥ క్షేపచక్రఘ్నధ్రువయుక్తస్య వ్యగోర్మధ్యస్య యః పర్యయగణః మధ్యగ్రహానయనేదాశరాద్వాదశభిర్భజ్యంతే ఫలం పర్యయాః, సపర్యయగణః=ఆపర్యయగణము, ద్విగుణః=రెండుచే గుణింపబడినదిగా, కార్యః=చేయవలెను, వణిగాదిగే=తులాదిషట్కమందైన, వ్యగుగ్రహేసతి=వ్యగురాశియగుచుండగా, రుయుతః=౧ కలుపబడి, తతః=పిమ్మట, అసౌసప్తహృతం=చక్రసంజ్ఞమేదికలతోఅది, తేనయుతః=దానిచేత కలుపబడినదై, తతః=పిదప, మునిహృతోర్వరితః=౭ చే భాగింపగావచ్చిన శేషము, విధితః=బ్రహ్మమొదలుకొని, సకాశాత్ శేషతుల్యః గతఃపర్వ=గ్రహణము, పాతి=కలుగుచున్నది, తథా=ఆప్రకారము, పర్వేశాః=పర్వాధిపతులు, సప్త=౭, ఉక్తంచవరాహసంహితాయాం॥

శ్లో॥ షణ్మాసోత్తరవృద్ధ్యాపర్వేశాః సప్తదేవతాః క్రమశః, బ్రహ్మ
శశీంద్రకుబేరావరుణాగ్నియమాశ్చవిజ్ఞేయాః॥ ౧౮॥

తా॥ క్షేపచక్రనిఘ్నధ్రువ సంస్కారమధ్య వ్యగుపర్యయగణమును దాని రాసులు ౧౨ చే విభజింపగా ఫలముపర్యయమగును దీనిని ౨ చే గుణించి తులాది షట్కవ్యగులైతే ౧ కలుపబడి చక్రసంఖ్యకలిపి ౭ చేత విభజింపగా మిగిలిన శేషము బ్రహ్మ మొదలుకొని పర్వాధిపతులగుదురు, పర్వాధిపతులు, ౧. బ్రహ్మ, ౨. చంద్రుడు, ౩. ఇంద్రుడు, ౪. కుబేరుడు, ౫. వరుణుడు, ౬. అగ్ని, ౭. యముడు, అగుదురు॥

ఉపపత్తిః॥ మాసషట్కేనవికః పర్వేశః - వర్షమధ్యేతు వ్యగుపర్యయో ౭ శ్చైకః - అతః - సః - ద్విగుణః పర్వేశః స్యాదిత్యుపపన్నమ్ - సరాశిషట్కస్య వ్యగోస్తో రాశిషట్కానంతరమేకవృద్ధిః - అతస్తులాదిగేవ్యగౌరుయుతఇతి - అత్రైకాదశవర్షాత్మకచక్రమధ్యేద్వావింశతిః పర్వేశాః - తేసప్తతష్టాః ఏకశ్చక్రతుల్యఏవభవతి - అతశ్చక్రయుతఇతి - పర్వేశాః సప్తఅతః సప్తతష్టఇత్యుపపన్నమ్ - నస్వతశ్చక్రోత్పన్నపర్వేశస్యయోజితత్వాత్ - పూర్వంచక్రఘ్న ధ్రువయోగోనోపపద్యత ఇతి చేత్ - భ్రాంతోసి - నహ్యేకచక్రేనిరవయవైకాదశభగణాయేన చక్రోత్థపర్వేశయోగేచక్రఘ్నధ్రువయోగో ౭ సర్థకఃస్యాత్ - కింత్వేతావాక్ భగణాదివ్యగుః ౧౧ - ౭ - ౧ - ౧౨ తత్రరాశ్యాదిరయంధ్రువః ౭ - ౧ - ౧౨ చక్రఘ్నః పూర్వ



యోజిత ఇదానీంచక్రఘ్నైకాదశయోజ్యాః - ఆచార్యణత్వేకాదశోత్థపర్వేశ ఏకశ్చక్రఘ్నః పర్వేశయోజితస్తదపియుక్తమేవ - నత్వేవంగ్రంథాదిజవ్యగుభగణానాం తదుత్పన్నపర్వేశస్యవాయోజనైః ప్రసజ్యేత - వాదమ్ - తదుత్థపర్వేశ ఇతివరాహోక్తేర్మాసశబ్దస్యచాంద్రముఖ్యత్వాత్ - చాంద్రవర్షే ద్వౌపర్వేశావితిగమ్యతే - నపునరేకస్మిన్ భగణఇతి - నచైకవర్షేవ్యగుభగణోప్యేకఇతివాచ్యం - గణితేనాధిక్యదర్శనాత్ - అతఏకభగణేపర్వేశద్వయంనయుక్తమితిచేత్ - అత్రబ్రూమః బ్రహ్మేందుశక్రవిత్తేశవరుణాగ్నియమాః క్రమాత్ - షణ్మాసభగణైకృఘ్నద్వ్యమిత గ్రహణాధిపాః ఇతిబ్రహ్మసిద్ధాంతోక్తిక్రమేణా దేవభగణేద్వౌపర్వేశావిత్యేవయుక్తమ్ - వరాహోక్తిర్యథాకథంచిత్కరయేతి విస్తరభయాద్విరరామ॥౧౮॥

ఉదాహరణము॥ ౦ - ౨ - ౨౬ - ౦ ÷ ౧౨ = ౦ - ౦ - ౧౨ - ౧౦ పర్యయగణము - మధ్యవ్యగురాసులు ౪ × ౨ = ౮ + ౩౭ = ౪౫ ÷ ౭ = ౬ శేషం - ౩ ఇంద్రుడు॥ ౧౮॥

అథ సూర్యాచ్చంద్రం సాధయతి.

శ్లో॥ తిథి రవిహతిరంశాస్తద్యుతోఽర్కే విధుః స్యాదథజినః ౨౪
గుణహారోద్వ్యంగయుక్ తద్గతిః స్యాత్ । స్వచరశరకలాః స్యాత్
సూర్యభుక్తిస్తతః స్యుర్భయుతి జగతగమ్యానాడికాస్తిథ్యపా
యాత్॥ ౧౯॥

టీ॥ తిథిరవిహతిః, తిథిః = తిథిసంఖ్య ౧౫, రవిహతిః = ౧౨ చే హెచ్చించబడి, అంశాః=భాగలు, స్యుః=అగుచున్నవి, తత్=ఆభాగలు, అర్కే=సూర్యునియందు, యుతః=కలుపబడినవై, విధుః=చంద్రుడు, స్యాత్=అగును, అథ=పిమ్మట, జినః=౨౪ చేత, గుణః=గుణింపబడి, హారః=హారము, ద్వ్యంగ ౬౨ యుక్ కలుపబడి, తద్గతిః=చంద్రగతి, స్యాత్=అగును, స్వచరశరా=౫౯ కలలు, సూర్యభుక్తిః=సూర్యగతి, స్యాత్=అగును, సూర్యచంద్రాభ్యాం=రవిచంద్రులవలన, భయుతిజా=నక్షత్రయోగమువల్లపుట్టిన, గతగమ్యా=గతైష్యములైన, నాడికాః=గడియలు, తిథ్య

పాయాత్=తిథియొక్క అంతమునుంచి, స్వగ్న=కావు, సూర్యోదయాత్=సూర్యోదయమునుంచి, యతోరవిచంద్రౌ=రవిచంద్రులు, తిథ్యంతకాలీనా=తిథ్యంతకాలమందు, తాః=అవి, తిథిఘటీసంస్కృతాః = తిథిగడియలుసంస్కరింపబడి, సూర్యోదయాత్=సూర్యోదయము మొదలుకొని, నక్షత్రయోగఘటికాః = నక్షత్రయోగగడియలు, స్యుః=అగుచున్నవి॥ ౧౯॥

తా॥ తిథిసంఖ్యను ౧౨ చే గుణింప భాగలగును ఆభాగలు సూర్యునిలోగలుప చంద్రుడగును, పిమ్మట ౨౪ చే గుణింపబడినహోరము ౬౨ చే గలుపబడిన చంద్రగతియగును, ౫౯ కలలు రవిగతియగును రవిచంద్రులవల్ల కలిగిన నక్షత్రయోగముల గతైష్యగడియలు సూర్యోదయాదియగును॥ ౧౯.

ఉపపత్తిః॥ సూర్యచంద్రాంతరము ద్వాదశభాగతుల్యే ఏకాతిథిర్భవతి - అతో ద్వాదశగుణాతిథిః - సూర్యచంద్రాంతర భాగస్తైరవా యావత్ క్షిప్యంతే తావచ్చంద్రో భవతి - అత్రగత్యంతరం చతుర్వింశతి భక్తం హోరః కుతో౽స్తి - అతో జినగుణో హారోగత్యంతరం - తత్రసూర్యగతిర్యోజ్యా చంద్రగతిః - స్వాదిక్యత్రిద్వ్యంగమితా సూర్యగతిః ప్రకల్పితా - అతోద్వ్యంగయుగిత్యుపపన్నమ్॥ ౧౯

ఉదాహరణము॥ రవి ౧-౧౮-౫౦-౮
౬- ౦- ౦-౦
చంద్రుడు ౭-౧౮-౫౦-౮
౩౦
౨౨౮
౬౦
౮౦౦)౧౩౭౩౦(౧౭ గతనక్షత్రములు
౧౩౬౦౦
౧౩౦-౮
౬౦
౭౮౦౮
౬౦
౪౩౩౬౦)౪౬౮౪౮౦(౧౦
౪౩౫౬౦౦



౩౨౮౮౦
౬౦
అనూరాధా ౧౯౭౨౮౦౦(౪౫
నక్షత్రవ్యయఘడియలు ౧౭౪౨౪౦
౧౦-౪౫
౨౩౦౪౦౦
౨౧౭౮౦౦
౧౨౬౦౦

౧౫ × ౧౨=౧౮౦ భాగలు ÷ ౩౦=౬ రాసులు
౨౭ - ౪౦ హోరము × ౨౪ = ౬౬౨ + ౬౨ =
౭౨౬ చంద్రగతి రవిగతి ౫౯

౬౦
౪౩౫౬౦

౭౨౬
౫౯
౭౮౫
౬౦
౪౭౧౦౦

రవి ౧-౧౮-౫౦-౮
చం ౭-౧౮-౫౦-౮
౯-౭-౪౦-౧౬
౩౦
౨౭౭
౬౦
౧౬౬౨౦
౪౦
౮౦౦)౧౬౬౬౦(౨౦ గతయోగములు
౧౬౦౦
౬౬౦
౬౦
౩౯౬౧౬
౬౦
౪౭౧౦౦)౨౩౭౬౯౬౦(౫౦ యోగ గత గడియలు
౨౩౫౫౦౦ ౫౦ - ౨౭
౨౧౯౬౦
౬౦
౧౩౧౭౬౦౦(౨౭
౯౪౨౦౦

౩౭౫౬౦౦
౩౨౯౭౦౦
―――――
౪౫౯౦౦

ఇతి శ్రీగణేశ దైవజ్ఞవిరచిత గ్రహలాఘవే మాసగణా ద్గ్రహణద్వయ సాధ సాధి కారః సప్తమః

# భూగోళాధ్యాయ సంగ్రహమ్

(౧) భగవంతుండీ లోకములనన్నిటిని సృజించుటకు పూర్వము ఉదకములను గలిగించి అందు సువర్ణవికారమగు బ్రహ్మాండమును బుట్టించెనుగాని యదిమిగుల నంధకారమగుటచే సూర్యుని సృజియించెను. అందువలననే ఆదిత్యుడను పేరు సూర్యునకు గలిగెను. ఇతనిచేతనే దివారాత్రములు కలిగి వెలుతురు కలుగుచుండెను పిమ్మట నీలోకములను సృష్టికొఱకు బ్రహ్మను సృజించి చతుర్వేదముల నొసంగి లోకసృష్టికి వరమిచ్చి యీ బ్రహ్మాండ మధ్యమందు బ్రవేశపెట్టెను॥

(౨) బ్రహ్మ సృష్టిచేయుటకై మనస్సున సంకల్పించగా చంద్రుడుద్భవిం చెను. అందువలననే "చంద్రమామనసోజాతః" అని శ్రుతిగలదు। పిమ్మట భూమి, ఉదకము, అగ్ని, వాయువు ఆకాశము అను పంచభూతములు కలిగెను. ఆకాశమువలన శబ్దము, వాయువువలన స్పర్శము, అగ్నివలన రూపము, ఉదకము వలన రసము, భూమివలన గంధము। అను విషయములుగలిగెను। అగ్నివలన సూర్యుడు, జలమువలన చంద్రుడు, తేజస్సువలన అంగారకుడు, భూమివలన బుధుడు, ఆకాశమువలన గురుడు, ఉదకమువలన శుక్రుడు, వాయువువలన శనియు కలిగిరి। మఱియు బ్రహ్మ మనోధ్యానముచేత మేషాది ౧౨ రాసులు అశ్విన్యాది ౨౭ నక్షత్రములును సృజియింపబడెను.

(౩) పిదప ప్రకృతిననుసరించి ఊర్ధ్వభాగమందు దేవతలను, గంధర్వులను, మధ్యభాగమందు పక్ష్యాదులను, అధోభాగమందు మనుష్యాదులను, స్థావరములగు పర్వతములను, వృక్షములను సృజియించి కర్మానుసారమునుబట్టి దేవతాప్రదేశమును



మానుషప్రదేశమును విభజించి సృష్టించెను। బ్రహ్మాండ కటాహమును జూచుటకు ద్వివిధములుగా నేర్పఱచి భూర్భువాదికమగు పదునాలుగు లోకములను సృజించెను. అనఁగా ౧ భూర్లోక ౨ భువర్లోక ౩ సువర్లోక ౪ జనర్లోక ౫ వసులోక ౬ తపోలోక ౭ సత్యలోక ౮ అతల ౯ వితల ౧౦ సుతల ౧౧ తలాతల ౧౨ రసాతల ౧౩ మహాతల ౧౪ పాతాళలోకములని॥

## భగోళనిర్ణయము

(౪) బ్రహ్మాండ మధ్యమందు ఆకాశకక్ష్యగలదు. దానిపరిమాణము ముందు చెప్పబడును. ఆ యాకాశ మధ్యమందు నక్షత్రములును నక్షత్రమండలము మధ్య నక్షత్రకక్ష్యగలదు. నక్షత్రమండలమునకు అధోభాగమందు శనికక్ష్య దాని దిగువున గురుకక్ష్య దీనిక్రింద కుజకక్ష్య దానిక్రింద రవికక్ష్య దీనియడుగున శుక్రకక్ష్య దానిదిగువ బుధకక్ష్య దీనిక్రింద చంద్రకక్ష్య దాని క్రిందవరుసగా సిద్ధ విద్యాధర మేఘవాయుమండలములు గలవు, వీటికి అధోభాగమందు సమస్త ఓషధులచేతను నిండియుండు భూమండలముగలదు. దీని దిగువను పాతాళాదిలోకములును, నాగకన్యకలచేతను రాక్షసులచేతను ప్రకాశించుచుండెను॥

## మేరుపర్వతస్థితి

(౫) భూమండలమున కుపరిభాగమందు ఉభయగోళములకు మధ్య సువర్ణవికారమయిన మేరుపర్వతముగలదు. దానియుపరిభాగమందు దేవేంద్రాదులును మహాఋషులును ఉండిరి. మేరుగిరియొక్క అధోభాగమందు రాక్షసులుండిరి. దేవతలకు రాక్షసులకు సదా శత్రుత్వమే స్వాభావికమయ్యెను. భూమండలముచుట్టును సముద్రముగలదు.

## పురచతుష్టయ నిర్ణయము

(౬) మేరువుమధ్యగాగల భూమియొక్క చుట్టునుండు సముద్రమునందు నలుదిక్కులను సువర్ణప్రాకారములుగల దేవనిర్మితమైన నాలుగుద్వీపములుగలవు.

ఏవియనగా తూర్పుదిశయందు భూమియొక్క నాల్గవభాగమున ౧౬౬౯ యోజనముల ప్రదేశమందు భద్రాశ్వవర్షమందు యవకోటియను ద్వీపమును దక్షిణదిశయందు భూమియొక్క నాల్గవభాగమందు భరతవర్షమందు లంకాద్వీపమును పశ్చిమదిశయందు భూమియొక్క నాల్గవభాగములో కేతుమాలావర్షమందు రోమకద్వీపమును ఉత్తరదిశని భూమియొక్క నాల్గవభాగములో కురువర్షమందు సిద్ధపురియనుద్వీపమునుగలవు సిద్ధపురియందు దేవసమానులగు సిద్ధులును దేవతలునుగలరు. లంకయందు రాక్షసులుగలరు. ఈ నాలుగుద్వీపములకు ఉన్నతమగు నుత్తరభాగమందు మేరుపర్వతముగలదు. సూర్యుడు మేషకటక తులామకరరాసులయందుండునపుడు నాలుగు ద్వీపములకు ఉపరిభాగమందు సంచరించుచుండును. అట్టికాలములయందు మధ్యాహ్నకాలమున విషువచ్ఛాయయుండదు. అప్పుడు సూర్యునకు ధృవునకు ౯౦ భాగలు ఎచ్చుతగ్గుగానుండును. ఆ కారణముచేతనే ఆ నాలుగుద్వీపములయందును విషువచ్ఛాయ లేదు.

అథ ధృవనిర్ణయ మాహ

(౭) మేరుపర్వతముయొక్క రెండుపార్శ్వములయందును గగనమధ్యమందు ధృవనక్షత్రములు రెండుగలవు. ఈ రెండును లంకాసిద్ధపురిద్వీపముల ప్రాంతములయందుండి భూమండలము నాశ్రయించియుండును. మేరువునందు విషువచ్ఛాయ లేదు. ఈ నాలుగుద్వీపములయందును లంబాంశలు ౯౦ ధృవమండలమందు అక్షాంశలు ౯౦॥

అథ. దేవరాక్షసయోః కాలభేదమాహ

(౮) రవి మేషాదిషట్కసంచారుడైనపుడు స్వస్థానమందుండే దేవతలకున్ను తులాదిషట్కమందుండునపుడు రాక్షసులకున్ను అగపడును. మేషాదిరాశులయందుండే సూర్యుడు దేవభాగమునకు సమీపస్థుడగుటచే గ్రీష్మకాలమందు ఎండవేడిమియును, తులాదిషట్కరాక్షస ప్రదేశసంచారము దూరమగుటచేత హేమంతఋతువునందు రవికి మందకిరణములున్ను మంచున్నుగలుగును. రవి మేషప్రవేశమందు దేవతలకు సూర్యోదయమున్ను రాక్షసులకు అస్తమయమున్ను కలుగును.



రవిమేష సంక్రాంతిదినమందు తూర్పుదిశయందుదయించి ఉత్తరదిశయందు దిరుగుచు మిథునమునకు మధ్యాహ్నమునుగలిగించును. కర్కటాదికన్యాంతమువరకు దక్షిణదిశయందు దిరుగుచు పడమట అస్తమించును. తులాదిధనురంతమువరకు నుత్తరసంచారముగలిగి రాక్షసులకు మధ్యాహ్నముగలిగించి మీనాంతమువరకు దక్షిణసంచారుడై యస్తమించును. ఈ కారణములవల్ల దేవాసురులకు అహోరాత్రములు వ్యత్యయములుగానుండును.

అథలోకనిర్ణయమాహ

(౯) భూగోళమున కుపరిభాగమునందు ఆకాశముండుటచేత పరలోకములేవియు ఊర్ధ్వాధోదేశముల యందు లేవని తెలియవలెను॥

అథదినప్రమాణ అధికన్యూన కారణమాహ

(౧౦) భచక్రము దేవతలకు ప్రదక్షిణముగాను రాక్షసులకు అప్రదక్షిణముగాను తిరుగును. నిరక్షదేశములకు భచక్రము సమముగా దిరుగుటచేత నా ప్రదేశమునందెప్పుడును దినప్రమాణము ముప్పదిగడియలేయగును. నిరక్షదేశమునుండి దేవాసురల ప్రదేశముయొక్క మేషతులా సంక్రమణములకు వ్యతిరేక దినములయందు ఆ రెండుప్రదేశములకు మధ్య భచక్ర సంచారాధిక న్యూనములవల్ల స్వదేశవిషువచ్ఛాయనుండి దినరాత్రిప్రమాణములు వృద్ధిక్షయములు గలుగును. రవి మేషాదిషట్కమందుండగా ఉత్తరక్రాంతిగలుగును. అందువలననే రవిఉత్తరదిక్కుగా తిరుగుచున్నట్లు కనిపించును. స్వదేశలంకామధ్య దేశమునకు రవి దూరస్థుడగును. గాన దినప్రమాణమెక్కువగా నుండును. తులాదిషట్కమందు రవియుండగా నిరక్షదేశమునుండి స్వదేశమునకు ఊర్ధ్వముగానుండుటచే అహోరాత్రవృత్తమునకు ఊర్ధ్వఖండము అర్ధన్యూనమగుటచే దినప్రమాణము తగ్గియుండును. ఊర్ధ్వఖండము అర్ధాధికమగుటచే రాత్రిప్రమాణము తగ్గును॥

## అధకాౖంతి విధినా దినపౖమాణమాహ

౧౧॥ భూపరిధి ౫౦౫౯।౩౭। ని ఉత్తరాకాౖంతిచేగుణించి భగణాంశలగు ౩౬౦చే భాగింపగా వచ్చినలబ్ధము ఉత్తరాకాౖంతి. నిరక్షదేశమునకు రవి అన్నియోజనములు ఉత్తరదిక్కుగా తిరుగును. దక్షిణాకాౖంతియందు దక్షిణముగా యిదేపౖకారముండును. ఇట్లే స్వదేశనిరక్షదేశముల అంతరమున్ను తెలియతగ్గది. ఎట్లనగా స్వదేశఅక్షాంశలచే భూమధ్యపరిధి యోజనములుగుణించిభగణాంశలచేవిభజింపవలెను. అక్షాంశలు ౬౬ గలపౖదేశమందు మిథునాంతమునకు ౬౦ గడియలుదినపౖమాణమేగాని రాతిౖలేదు. దీనికి వ్యతిరేక దేశములయందు రాతిౖపౖమాణము ౬౦ గడియలు దినపౖమాణము శూన్యమగును. రవిదక్షిణదిశను దిరుగుచుండేగా నుత్తరదేశమందు రాతిౖకాలము వృద్ధిగాను పగటిభాగము తక్కువగాను యుండును. నిరక్షదేశమునుంచి దక్షిణోత్తరములకు ౯౨౭ యోజనములకు పిమ్మటభచకౖము పైభాగమందు సంచరించదు. ఆ పౖదేశమునందు దివారాతుౖలపౖమాణము ౬౦ గడియలు, నిరక్షదేశమునకు ౧౨౬౦ యోజనములు దూరముగల భూమియొక్క నాల్గవవంతువద్ద అక్షాంశలు ౬౯।౨౩ అక్కడ ధనుర్మకరమాసములయందు రవి దేవభాగమందు కనిపించదు. ఇట్లు నిరక్షదేశమునకు ౯౭౫ యోజనములుగలచోట మిథునకర్కటమాసములయందును కనపడదు. ఆదేశమందు విషువద్వృత్తము దక్షిణక్షితిజముఅయిన ఉత్తరక్షితిజవరకు ౨౦ భాగలు కలిగియుండును. రవి ఎప్పుడు ౨౦ భాగలు ఉత్తరాకాౖంతిగలిగియుండునో అప్పుడు దక్షిణక్షితిజము, ౦ రవిబింబము సగముకనిపించును, మధ్యాహ్నమందు దక్షిణక్షితిజమైన ౪౦ భాగల ఉన్నతముగానుండును. అక్కడ దినపౖమాణము ౬౦ గడియలు, రాతిౖశూన్యము. పిమ్మట దినమునుండి ఉత్తరాకాౖంతి హెచ్చుటవలన ఉత్తరక్షితిజను స్పృశించక పిమ్మట పరమకాౖంతిని యెంతవరకు సంచరించునో అప్పుడు మిథునాంతమందు ఉత్తరక్షితిజమైన ౪ భాగలు పొందును. తిరిగి యిట్లే కౖమముగా అధికమగును. అట్లు కర్కటాంతమందును తిరిగి క్షితిజను స్పృశించును. అందువల్ల రెండుమాసములు దేవభాగమందెల్లప్పుడును రవి గనపడును. ఈ కాలములో అసురభాగమందు రవి కనిపించడు. ఈ యుక్తిచేతనే ధనుర్మకరమాసములయందు దేవభాగమందు రవి కనిపించడు. ౯౭౫ యోజనముల



లోపల పౖదేశమందు కనబడును. నిరక్షదేశమునుండి ౧౧౦౦ యోజనములలోపల వృశ్చికాది నాలుగుమాసములయందు దేవభాగమందు రవి కనపడదు. వృషాది నాలుగుమాసములయందు అసురభాగమందు కనిపించదు. ఆ దేశమందు విషువద్వృత్తము ౧౧ భాగల ౪౩ లిప్తలుండును. అక్కడ రాతిౖ శూన్యము. ఇట్లు సింహాంతము మొదలు నాలుగుమాసములు దేవభాగముకు రవి యెల్లప్పుడును కనబడుచుండును. రాతిౖశూన్యము, రాక్షసభాగమందు రాౖతియగును పగలులేదు. ఇట్లే అక్షాంశలు ౯౦ గల దేశమందు రవి మేషమాసమందు ఉదయించి మిథునాంతమునకు మధ్యాహ్నమును ఆరుమాసములగువరకు దేవభాగమందస్తమించును. ఈ కాలము రాక్షసులకు రాతిౖకాలమగును. తులాది మీనాంతము దేవతలకు రాతిౖయు రాక్షసులకు పగలు అగును. పితృదేవతలు చందౖమండలమునకు ఊర్ధ్వము గనుక కృష్ణాష్టమి యందు రవి ఉదయమై అమావాస్యకు మధ్యాహ్నమై శుక్లాష్టమికి అస్తమించి పూర్ణిమకు నిశీథమైయుండును. గనుకనే మధ్యాహ్నకాలమైన అమావాస్య పితృతర్పణార్హతయగు భూమండలమునుండి ౧౫ భాగములకు ౩౩౪ యోజనములగును. అప్పుడు మిథునాంతార్కుడై మధ్యాహ్నమగును. అప్పట్లో అక్కడ మధ్యాహ్నచ్ఛాయలేదు. అక్కడ ౨౪ భాగములు కాౖంతియగును. యేదేశమందు అక్షాంశలు ౨౪ భాగములకంటె తక్కువయగునో అచ్చట మధ్యాహ్నచ్ఛాయ దక్షిణదిక్కుగానుండును. ఉత్తరాకాౖంతి ౨౪ భాగలకంటె తగ్గినయెడల ఉత్తరదిక్కుగా ఛాయలుండును. అసురదేశమునందు నిరక్షదేశమునుంచి ౩౩౪ యోజనములలోపల ధనురంతసూర్యుడు మధ్యాహ్నమందుండును. అచ్చట ఛాయాభావము. ఇట్లు సురభాగమందు మేరువుకు అభిముఖమున్ను దేవభాగమునకు దక్షిణమున్ను అగును. భదాౖశ్వవర్షమునకు ఉపరిభాగమందు యవకోటి పట్టణమందు రవి మధ్యాహ్నుడైనప్పుడు భరతవర్షమందు లంకాపట్టణమందు రవి ఉదయమున్ను కేతుమాలావర్షమందు రోమకపట్టణమందు అర్ధరాతిౖయు కురువర్షమందు సిద్ధపురియందు అస్తమయమున్ను కలుగును. ఇట్లే లంకయందు మధ్యాహ్నముకు రోమకయందుదయము సిద్ధపురియందర్ధరాతిౖము యవకోటియందస్తమానమున్ను కలుగును. లంకయందుదయము యవకోటియందు మధ్యాహ్నము సిద్ధపురియందస్తమయము రోమకయందు అర్ధరాతిౖము అగును.




## అథనత్యున్నతిప్రకారమాహా

౧౨॥ క్షితిజమంచి ఉన్నతిన్ని ఆకాశమధ్యమండిన తిన్ని అగును. ధ్రువమేరువులకు ఉన్నతి ౯౦ భాగలు భచక్రమునతి ౯౦ భాగలు నతమును నిరక్షదేశమునుండి ఉత్తరమును మేరువునుపొంది ౩౩౪ యోజనములుగల స్థానమందు ఉత్తరక్షితిజమండి ధ్రువునకు ౨౪ భాగలు ఉన్నతము, ఆ ప్రదేశమందు ఆకాశమధ్యమునుండి భచక్రమును దక్షిణముగా ౨౪ భాగలునతి. ఆ ప్రదేశమందే ఖమధ్యమునుండి ఉత్తరముగా ధ్రువునికి ౬౬ ఆ దేశమందే దక్షిణక్షితిజమండి భచక్రమునకు ఉన్నతి ౬౬ భాగలు. ఇట్లే స్వదేశాక్షాంశలు భచక్రముయొక్క మధ్యమండి దక్షిణమునకు నతియగును, ఉత్తరక్షితిజమండి ధ్రువునకు ఉన్నతియగును. సర్వత్ర స్వదేశఅక్షాంశపరమభాగలు ౯౦ ఖ మధ్యమండి ధ్రువునకుత్తరము నతియగును. దక్షిణక్షితిజమండి భచక్రమునకు ఉన్నతియును దెలియవలెను. ఇట్లు నిరక్షదేశమునకు వెళ్ళుచు ఉన్నతి విపరీతముగా నుండును.

## అథగ్రహాణాం కక్ష్యనిర్ణయమాహా

౧౩॥ మేరుపర్వతముయొక్క క్రిందను మీదను ఉండు అగ్రిద్వయములకు ఉపర్యధోభాగములయందున్న ధ్రువనక్షత్రములకు కట్టబడిన భచక్రము ప్రవహాఖ్య వాయువుచే ప్రేరేపింపబడి సదా తిరుగుచుండును. ఆ చక్రమందు గ్రహకక్షలకంటె నుపరిభాగమందు నక్షత్రకక్ష గలదు. నక్షత్రకక్షకు దిగువున శనికక్షయు దానిక్రింద



గురుకక్షయు పిమ్మట వరుసగా క్రిందకు కుజ, రవి, శుక్ర,. బుధ, చంద్రకక్షలును గలవు. భచక్రాంతరాశిపరిమితమునుబట్టి దగ్గరగానుండు గ్రహములు స్వల్పకాలములోను దూరముగానుండు గ్రహములు అధికకాలములోను భచక్రమునుతిరిగి వచ్చుచుండును. చంద్రుని మార్గప్రదేశము సమీపమగుటచేత శీఘ్రకాలములో ౨౭ దినములలోను, శనికి దూరమగుటచేత ఆలస్యముగా 30 సంవత్సరములలోను భచక్రము తిరిగి వచ్చుచుండును.

## అథవారోత్పత్తి సృష్ట్యాదిసావనవర్షమాసాధిపనిర్ణయమాహా

౧౪॥ శని, గురు, కుజ రవి శుక్రబుధచంద్రులు వరుసగా నొకరికంటె నొకరు భూమికి సమీపమునందుండిరి. మొదటిగ్రహమునకు నాల్గవగ్రహముయొక్క వారముచొప్పున క్రమముగా యేడుగురు సావనవారాధిపతులయ్యెను. ఉదాహరణము॥ శనికి నాల్గవగ్రహము రవిగాన ౧ఆదివారము, రవికినాల్గవగ్రహము చంద్రుడుగనుక ౨ సోమవారము, చంద్రునకు నాల్గవగ్రహము కుజుడగుటచే ౩ అంగారకవారము, కుజునికి నాల్గవగ్రహము బుధుడైనందున ౪ బుధవారము, బుధునికి ౪వ గ్రహము గురుడుకాబట్టి ౫ గురువారము, గురునికి ౪వ గ్రహము శుక్రుడుఅయినందున ౬ శుక్రవారము, శుక్రునకు ౪వగ్రహము శనిగనుక ౭ శనివారము॥ ఇట్లేశని మొదలుకొని మూడవగ్రహముచొప్పున సృష్ట్యాది వర్షాధిపతులయ్యెను. ఉదాహరణము॥ కుజ, శుక్ర, చంద్ర, గురు, రవి, బుధ, శనులు ఇట్లు వ్యత్యయముగా చంద్రుడు మొదలుకొని మూడవగ్రహము చొప్పున సృష్ట్యాదిసావనమాసాధిపతులగుదురు. ఉదాహరణము॥ శుక్రుడు, కుజుడు, శని, బుధుడు, రవి, గురుడు, చంద్రుడు వరుసగానగును॥

## అథహోరాధిపతినిర్ణయమాహా

౧౫॥ ఆదివారము, మొదటి హోరాధిపతిరవి, పిమ్మట వరుసగా, శుక్రబుధచంద్రశనిగురుకుజులు తిరిగి రవిమొదలు ౨౪ గంటలకు అధిపతులగుదురు. సోమవారం ఉదయమునకు చంద్రహోరయు తక్కినవారములకు మిగిలిన ఆయాహోరాధి

పతులగుదురు. దినం ౧కి ౨౪ హోరలు, గ్రహములు౭ గాన మూడుసార్లు ౩×౭= ౨౧ హోరలయినవి. మిగిలిన ౩ హోరలను మూడుగ్రహములు వెళ్లగా నాల్గవగ్రహముయొక్క హోరఉదయమును వచ్చుటచేత నాగ్రహాధిపత్యముగల వారమువచ్చెను. యిందునగురించి యీదిగువ చక్రమువలన సవిస్తరముగా బోధపడగలదు.

### అథకక్ష్యా ప్రమాణమాహ

౧౬॥ రవికక్షకు ౬౦ రెట్లు భకక్షయగును. కక్ష్యయనగా భచక్రమునందు గ్రహములు తిరుగుమార్గము. రవి కక్షప్రమాణము ౪౩౩౧౫౦౦।౧౨ భచక్ర ప్రమాణము ౨౫౯౮౯౦౦౦।౧౨॥

కల్పోక్తచంద్రభగణములను చంద్రకక్షచే హెచ్చించగా ఆకాశకక్షయగును. అదేసూర్యకిరణవ్యాప్తిప్రదేశమగును. ప్రమాణయోజనములు, ౧౮౭౧౨౦౮౦౮౬౦౦౦౦౦౦.






శ్లో॥ మందామరేజ్యభూపుత్ర సూర్యశుక్రేందుజేందవః । మందాదధః
క్రమేణస్యుః చతుర్థాదివసాధిపాః ॥

శని మొదలు క్రిందకు నాల్గవగ్రహము, రవిగాన శనివారము తరువాత ఆది వారము, రవికి నాల్గవగ్రహము చంద్రుడగుటచే ౨ వది సోమవారము, చంద్రునికి నాల్గవగ్రహము కుజుడు గనుక ౩ వది మంగళవారము యిట్లు వారములవరుస కలిగెను.

### గ్రహాణాం కక్ష్యాప్రమాణమాహ

| గ్రహములు | కక్షలు ప్రమాణం యోజనములు | ఉచ్ఛ్రాయ యోజనములు |
|---|---|---|
| ౧. చంద్రుడు | ౩౨౪౦౦౦ | ౫౦౪౩౫ |
| ౨. బుధశీఘ్రోచ్చ | ౧౦౪౩౨౦౯ | ౧౬౪౧౬౬।౫౦ |
| ౩. శుక్రశీఘ్రోచ్చ | ౨౬౬౪౬౩౭ | ౪౨౦౫౬౯ |
| ౪. రవికక్ష్యా | ౪౩౩౧౫౦౦।౧౨ | ౬౮౪౧౫౭।౩౧ |
| ౫. అంగారకుడు | ౮౧౪౬౯౦౯ | ౧౨౮౭౫౦౩ |
| ౬. చంద్రోచ్చ | ౩౮౩౨౮౪౮౪ | ౬౦౬౦౨౩౭ |
| ౭. బృహస్పతి | ౫౧౩౭౫౭౬౪ | ౮౧౨౩౪౫౬ |
| ౮. రాహువు | ౮౦౫౭౨౮౬౪ | ౧౭౮౪౦౫౧ |
| ౯. శనైశ్చరుడు | ౧౨౭౬౬౮౨౫౫ | ౧౯౦౮౦౯౫౬ |
| ౧౦. నక్షత్రములు | ౨౫౯౮౯౦౦౧౨ | ౪౧౦౯౬౬౫౬।౫౯ |
| ౧౧. ఆకాశము | ౧౮౭౧౨౦౮౦౮ ౬౦౦౦౦౦౦ | |

| గ్రహములదినగతియోజనములు ౧౧౮౫౮ సౌరవత్సరప్రిమాణం | భచక్రలిప్తలు గతి | సం మా ది |
|---|---|---|
| ది గ విగ ప లిప | శని ౨౧౬౦౦ ÷ ౨= ౧౦౮౦౦ | ÷ ౩౬౦ = ౩౦।౦।౦ |
| ౩౬౫।౧౫।౩౦।౨౨।౩౦ | గురుడు ౨౧౬౦౦ ÷ ౫= ౪౩౨౦ | ÷ ౩౬౦ = ౧౦।౦।౦ |
| ౩౬౧। బార్హస్పత్యం | కు౨౧౬౦౦ ÷ ౩౧ ౧౩/౩౦= ౬౮౭ | ÷ ౩౬౦ = ౧।౧౦।౨౭ |
| ౩౬౦ సాధనం | ర౨౧౬౦౦ ÷ ౫౯ ౨/౧౫ = ౩౬౫ | ÷ ౩౬౦ = ౧।౦।౫. |
| ౩౫౪ చాంద్రం. | శు౨౧౬౦౦ ÷ ౯౬= ౨౨౫ ÷ | ౩౬౦ = ౦।౭।౧౫। |
| ౩౨౪ నాక్షత్రం | బు౨౧౬౦౦ ÷ ౧౮౬ ౨/౫ = ౧౧౫ ÷ | ౩౬౦ = ౦।౩।౨౫ |
| ఇంగ్లండులో ది గం మి సె ౩౬౫।౫।౪౮।౪౫ | చం౨౧౬౦౦ ÷ ౭౯౦ ౭/౧౨= ౨౭ ÷ | ౩౬౦ = ౦।౦।౨౭ |
| రవియొక్క మధ్యనుండి భూమధ్యము గల దూర యోజనములు ౧౮౬౦౦౦౦౦౦. | బుధ శుక్రులకు వక్రి | ములేనియెడల యీ ప్రిమాణమే అగును. |

గ్రంథము సంపూర్ణము.